Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!





# చందమామ

మార్చ్ 1995



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : **5.00**

సంవత్సర చందా : **60.00**




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## పిల్లల కోసం వినోదం

పిల్లలకని ప్రత్యేకంగా టీవీ ఛానల్స్ ప్రవేశపెడితే బావుంటుందని పోయిన నెలలో చెప్పుకున్నాం. అలా ప్రవేశ పెట్టాలంటే ఎటువంటి కార్యక్రమాలను ప్రసారం చేయాలి? అలాంటి కార్యక్రమాలు, బాలల చిత్రాలు చాలినన్ని ఉన్నాయా? మొదలైన సమస్యలు ఎదురవుతాయి. మనదేశంలో వివిధ భాషలలో యేటా ఏడెనిమిది వందల కథా చిత్రాలు నిర్మించబడుతున్నాయి. వాటిలో బాలల చిత్రాలను వేళ్ళమీద లెక్కించవచ్చు. అయితే, చాలా చిన్న దేశమైన బల్గేరియాలో యేడాదికి 70-80 చిత్రాలే నిర్మించినప్పటికీ వాటిలో సగం పిల్లల కోసం నిర్దేసించబడినవే!

మనదేశంలో బాలలచిత్రాలు నిర్మించే నిర్మాతలు కథల కోసం నానా తంటాలు పడుతూంటారు. నిజానికి మనదేశంలో ఉన్నన్ని పౌరాణిక గాథలు, జానపద కథలు మరేదేశంలోనూ లేవని చెప్పవచ్చు. ఐదువేల సంవత్సరాల సుదీర్ఘ చరిత్ర కలిగిన దేశం మనది. చారిత్రక సంఘటనలను చిత్రాలుగా రూపొందించవచ్చు. అమెరికా, ఇంగ్లాండు దేశాలలో బాగా అమ్ముడయ్యే నవలల ఆధారంగా చిత్రాలు నిర్మిస్తారు.

ఇక వినోద ప్రధానమైన చిత్రాలను మాత్రమే కాకుండా, వైజ్ఞానిక విషయాలను గురించీ, క్రీడలను గురించీ,చారిత్రక స్థలాలను గురించీ, మహనీయుల జీవితవిశేషాలను గురించీ వివరించే చక్కటి టీవీ కార్యక్రమాలను రూపొందించవచ్చు. అయితే, అవి ఆరోగ్యకరమైన వినోదాన్ని కలిగించి,పిల్లలలో మంచిఅభిరుచిని పెంపొందించేవిగా ఉండడం చాలా ముఖ్యం!

సంపుటి : 97 మార్చ్ '95 సంచిక: 3

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00

SANKAR...

## ఇప్పుడు కొత్త హంగులతో, సరికొత్త గెటప్‌తో వెలువడుతున్నది!

# వనిత

### సమగ్ర కుటుంబ మాసపత్రిక

19 సంవత్సరాలుగా పఠితల మన్ననలు పొంది, నాణ్యతా ప్రమాణాలలో దీటుగా నిలిచిన స్త్రీ జన మాసపత్రిక 'వనిత' నాలుగు నెలల విరామం తర్వాత 'యువ నామ సంవత్సరం' నుంచి పునఃప్రారంభం కానున్నది. ముందుగా ప్రకటించినట్లుగానే ఈ విరామం కేవలం అత్యంత ఆధునిక ముద్రణా సౌకర్యాలు సమకూర్చుకోవడం కోసం, మారుతున్న పాఠకుల అభిరుచుల మేరకు పత్రికని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దడానికి వినియోగించాము. ఇందులో భాగంగా ఇప్పుడు 'వనిత' సమగ్ర కుటుంబ మాస పత్రికగా ఆబాల గోపాలాన్నీ ఆకట్టుకునే రీతిలో, సినిమా అనుబంధంతో పాటు వెలువడుతుంది. శీర్షికలలో వైవిధ్యం 'వనిత' కి మారు పేరు! ఆ పేరు నిలబెట్టుకుంటూనే మరిన్ని ఉపయుక్తకరమైన శీర్షికలతో వనిత 'యువ నామ సంవత్సర ఉగాది సంచిక' మార్చి చివరి వారంలోనే వెలువడుతుంది.

**పేజీలు : 100** వెల : రూ. **10/-** మాత్రమే.

చందా వివరాలకు :
వనిత
డాల్టన్ ఏజన్సీస్
చందమామ బిల్డింగ్స్, వడపళని
మద్రాసు - 600 026. ఫోన్ : 4838787

వార్తలు - విశేషాలు :

# స్వీడన్‌లో సోషల్ డెమొక్రాట్స్

తల్లితండ్రు లిరువురూ ఉద్యోగాలకు వెళుతూన్న పరిస్థితిలో బిడ్డ అనారోగ్యానికి లోనయితే ఆ బిడ్డను ఎవరు చూసుకుంటారు? ఈ ప్రశ్నకు, రెండు మూడు సమాధానాలు చెప్పవచ్చు. అయితే స్వీడన్ ప్రభుత్వం దీనికొక ఉత్తమ పరిష్కారాన్ని అనుసరిస్తున్నది. భార్యాభర్త లిరువురూ ఉద్యోగాలు చేస్తూన్నప్పుడు బిడ్డకు ఒంట్లో బాగోలేకపోతే, భర్త ఇంటి దగ్గరే వుండి బిడ్డను చూసుకోవాలి. ఆ సమయంలో ఆయన ఉద్యోగానికి వెళ్ళినట్టే భావించి, ప్రభుత్వం జీతం డబ్బులు అందజేస్తుంది! స్వీడన్‌లో అధికారంలో ఉన్నది సంక్షేమ ప్రభుత్వం కాబట్టి ఇది సాధ్యమవుతున్నది. బాల్యం నుంచి వృద్ధాప్యం వరకు ప్రతి దశలోనూ ప్రజల అవసరాలను తీర్చడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుంది. అందుకే ఉద్యోగాలు లేని వారికి కూడా భృతిని కల్పిస్తుంది!

ఇదెలా సాధ్యమవుతుందని ఆశ్చర్యం కలగవచ్చు. దాదాపు 60 సంవత్సరాలకు పూర్వం, సరిగ్గా చెప్పాలంటే 1932వ సం॥లో సోషల్‌డెమొక్రటిక్ పార్టీ అధికారం చేపట్టి, మధ్య ఆరేళ్ళ కాలం తప్ప, తక్కిన కాలంలో స్వీడన్‌లో పాలకపక్షంగా కొనసాగుతున్నది. ఆ పార్టీ అధికారంలో సుస్థిరతను సాధించిన తరవాత, కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టింది. పరిశ్రమలను నెలకొల్పడానికి ప్రైవేటు సంస్థలను అనుమతించింది. చాలా మందికి ఉద్యోగావకాశాలు లభించాయి. ప్రజలలో అన్ని తరగతుల వారికి సంక్షేమ పథకాలను విస్తరింపజేయడానికి ప్రభుత్వం పన్నులను పెంచింది. పరిశ్రమలలో పనిచేస్తున్న వారిని ట్రేడ్‌యూనియన్లు స్థాపించమని ప్రోత్సహించింది. అన్ని రంగాలలోనూ సత్వర అభివృద్ధిని సాధించి, దేశం సుసంపన్నమయింది. ప్రజలు సుఖ సంతోషాలతో తృప్తిగా జీవించసాగారు.

అయితే, అధికారంలో ఉన్న వామపక్ష ప్రభుత్వం, సంక్షేమ పథకాలకు నిధులను దుర్వినియోగం చేస్తున్నదని ప్రతిపక్షాలయిన కన్సర్వేటివ్-లిబరల్ పార్టీలు భావించాయి. 1986వ సం॥లో ప్రధానమంత్రి ఓలాఫ్ పాల్మే హత్య చేయబడ్డాడు. ఇంగ్వర్ కార్ల్‌సన్, సోషల్ డెమొక్రటిక్ పార్టీ నాయకుడయ్యాడు. 1991వ సం॥లో జరిగిన ఎన్నికలలో ఆ పార్టీ ఓడిపోయింది. కన్సర్వేటివ్-లిబరల్ పార్టీలు కలిసి కార్ల్ బిల్ట్ నాయకత్వంలో ఏర్పాటుచేసిన ప్రభుత్వం, సంక్షేమ పథకాలలో చాలా వాటిని రద్దు చేసింది. పరిశ్రమలలో ప్రభుత్వం పాత్రను కుదించింది. దాంతో నిరుద్యోగ సమస్య పెరగడం వల్ల ప్రజలు ఆందోళన చెందసాగారు. మళ్ళీ సోషల్ డెమొక్రటిక్ పార్టీకి అధికారం అప్పగించాలనుకున్నారు. 1994 సెప్టెంబర్ నెలలో జరిగిన ఎన్నికలలో సోషల్ డెమొక్రటిక్ పార్టీ విజయం సాధించింది. కార్ల్‌సన్ మళ్ళీ ప్రధానమంత్రిగా ఎన్నుకోబడ్డాడు.

ఇక్కడ చెప్పుకోతగ్గ మరొక విశేషమేమంటే– స్వీడన్, పేరుకు రాచరికపు వ్యవస్థ కింద ఉన్నప్పటికీ, రాజు ప్రభుత్వ వ్యవహారాలలో జోక్యం కల్పించుకోడు.





# రంగయ్య వ్యాపారం

రంగయ్య అనేవాడి తండ్రి రాజుగారి కొలువులో పనిచేస్తూ బాగా డబ్బు సంపాదించాడు. అతడు కొడుకును కూడా కొలువులో చేరమంటే, వాడు కాదని వ్యాపారం చేస్తానన్నాడు.

"వ్యాపారానికివారసత్వంకావాలి.మనింట్లో వ్యాపారం అచ్చిరాదు. నామాట విని కొలువులో చేరు," అన్నాడు తండ్రి.

కాస్త దూరంగా వుండి ఈ మాటలు విన్న రంగయ్య తల్లికి కోపం వచ్చి, "చెట్టంత మేనమామ వ్యాపారంలో అంచెలంచెలుగా పైకివస్తే, వ్యాపారం అచ్చిరాదంటావేం? నీకు నీ వాళ్ళే తప్ప నా వాళ్ళు ఆనరా?" అంటూ భర్తమీద ఛెంగునలేచింది.

"నువ్వు చెప్పేది నీ తమ్ముడు లోకనాథం గురించే కదా! వాడు కన్నకొడుక్కే వ్యాపార రహస్యాలు చెప్పడు. నీ కొడుక్కి చెబుతాడా? ఎక్కడో ఒకచోట శిక్షణ లేకుండా ఎవరైనా వ్యాపారంలో ఎలా పైకి వస్తారు?" అన్నాడు రంగయ్య తండ్రి.

రంగయ్య తల్లి ధైర్యం చెబుతున్నదానిలా కొడుకు భుజం మీద చేయివేసి, భర్తతో, "నీవన్నీ మరీచోద్యాలు. నా తమ్ముడు నీలాగా స్వార్థపరుడుకాదు. నగల దుకాణాన్ని కొడుక్కు అప్పజెప్పి తను మాత్రం ఇప్పటికీ కిరాణా దుకాణమే చూసుకుంటున్నాడు. తన కూతురు వల్లిని మన రంగయ్యకివ్వాలనుకుంటున్నాడు. అడగాలే కానీ వాడు మన రంగయ్యను వళ్ళో కూర్చోబెట్టుకుని మరీ వ్యాపార రహస్యాలు బోధిస్తాడు," అన్నది.

తల్లిదండ్రులిలా గొడవ పడుతూంటే రంగయ్య చిరాకుపడి, "మీ గొడవ మీది. నా గురించి ఆలోచించరేం? నాకు సొంత తెలివి వుంది.ఒకరి సలహాఅక్కర్లేదు.వ్యాపారంలో నా అంతట నేనే రాణించగలను. అర్థమయిందా?" అన్నాడు.

"వసుంధర"

"అయితే మహచక్కగా రాణించు. నేను మాత్రం పెట్టుబడికి ఒక్కపైసాకూడా ఇవ్వను," అన్నాడు రంగయ్య తండ్రి.

"నేనిస్తాను,"అన్నది రంగయ్య తల్లి పట్టు దలగా.

"నా వ్యాపారానికి తెలివే పెట్టుబడి. మీ ఇద్దరి డబ్బూ నాకక్కర్లేదు. ఒక ఏడాదిపాటు నన్ను మరిచిపొండి. ఆ తర్వాత మంచి వ్యాపారినై తిరిగి వస్తాను," అంటూ రంగయ్య ఇల్లు వదిలిపెట్టాడు.

దారిలో వాడికొక సాధువు ఎదురయ్యాడు. రంగయ్య సాధువుకు నమస్కరించి, తను బయల్దేరిన పని చెప్పి దీవించమన్నాడు. సాధువు పైసలడిగితే ఆశ్చర్యపడి, "సర్వసంగ పరిత్యాగివి.నీకు డబ్బెందుకు?"అనిఅడిగాడు.

"డబ్బుకోసమే కదా ఈ వేషం!నాకు చదువు రాదు. ఏపనీ చేతకాదు. కాలూ చెయ్యీ సక్ర మంగా వున్నాయి. ఈ వేషం వల్ల తప్ప డబ్బు రాదు, పొట్టగడవదు," అన్నాడు సాధువు.

"అంటే ఈ వేషం కూడా ఒక వ్యాపారమే అన్నమాట!"అన్నాడురంగయ్యఅనుమానంగా.

"పేర్లలో తేడా తప్ప లోకంలో వ్యాపారం కానిదంటూ ఏదీలేదు!" అని సాధువు ఒక క్షణం ఆగి, "అయితే ఒక పనిచేద్దాం. నేని ప్పుడు చేస్తున్న వ్యాపారంలో నిన్నుకూడా భాగస్థుడుగా చేర్చుకుని బాగా వృద్ధి చేయదలి చాను. లాభాలను చెరిసగం పంచుకుందాం," అన్నాడు.




ఇందుకు రంగయ్య అయిష్టంగానే సరేన న్నట్టు తలాడించాడు.

ఆ మర్నాడే పదిమందీ నడిచే దారి పక్కన ఒక గుడారం లేచింది. డబ్బు తీసుకుని పాపాలను కడిగేసే పాపానందస్వామిగా మారి పోయాడు సాధువు. మారువేషం వేసుకుని వాడి శిష్యుడయ్యాడు రంగయ్య.

మైలతుత్తంలో నీరుండడం వల్ల నీలంగా వుంటుంది. వేడి చేస్తే ఆ నీరు ఇగిరిపోయి అది తెల్లగా అవుతుంది. తెల్లటి మైలతుత్తాన్ని బయట వదిలితే తిరిగి నీటిని పీల్చుకుని, అది నీలంగా మారుతుంది! ఈ సూత్రాన్ని ఆధారంగా చేసుకుని తన పథకాన్ని రూపొం దించాడు సాధువు.

పాపానందస్వామికి కుడి పక్కన మరుగుతున్న నీటిపై ఒక పళ్ళెంలో తెల్లటి మైల తుత్తపు పొడి వుంటుంది. ఎడమపక్క కాలిన పెనమ వుంటుంది. రంగయ్య డబ్బు తీసుకున్న వ్యక్తి చేతిలో తెల్లనిపొడి వేసి, కళ్ళు మూసుకోమంటాడు. కాసేపటికాపొడి నీలంగా మారుతుంది.

"నీ శరీరంలోని పాపం విషమై ఈపొడిలో ప్రవేశించింది. కళ్ళుతెరిచిచూసుకో!" అంటాడు రంగయ్య.

పాపి కళ్ళు తెరిచి చూసి గజగజవణికిపోతాడు. ఆపొడిని సాధువు చేతిలో వేస్తాడు. సాధువు కళ్ళు మూసుకుని మంత్రోచ్చారణ చేసి, ఆ పొడిని ఎడమ ప్రక్క పెనం మీద వేస్తాడు. కొద్ది క్షణాల్లో ఆ పొడి తెల్లబడుతుంది.

"నీ పాపం గాలిలో కలిసిపోయింది, ఇక వెళ్ళు!" అంటాడు సాధువు.

వాడు తృప్తిగా వెళ్ళిపోతాడు. సాధువు చిటికెడు పొడికి రూపాయి ధర పెట్టాడు.

ఒకసారి వచ్చినవాణ్ణి తిరిగి మళ్ళీ వచ్చేలా చేసేందుకు సాధువు ఇలా చెబుతూండేవాడు: "మనిషి పుట్టుక పాపమయం. ఊపిరి పీల్చడంలో, వదలడంలో కూడా కంటికి కనిపించని సూక్ష్మజీవాలను మనకు తెలియకుండా చంపుతూంటాం. మనం వేసే ప్రతి అడుగూ మన చేత పాపాలను చేయిస్తుంది. అందువల్ల పాపాలు లేకుండాబ్రతకలేం;అట్లని పాపాలను పూర్తిగా కడిగేసుకోనూలేం! మీమీ శక్తిని బట్టి మీలోని పాపాలను ఎంతో కొంత కడిగేసుకోవాలనే, నేనిక్కడికి వచ్చాను. ఆ



విధంగా మీకు పూర్తిగా కాకపోయినా ఎంతో కొంత ఉపశమనం కలుగుతుంది!"

ఇందువల్ల, మళ్ళీ మళ్ళీ వచ్చినా ఆ పొడి ఇంకా ఇంకా నీలంగా మారుతూనే వున్నదేమన్న శంక పాపులకు కలిగేది కాదు.

వచ్చిన పాపుల్లో కొందరు ఒక్క చిటికెడు పొడినే తీసుకునేవారు. కొందరు ఇంకా ఎక్కువ తీసుకునేవారు. కొందరు ఒక్కసారే వస్తే, కొందరు ప్రతి రోజూ వచ్చేవారు. అన్ని రోజులూ గుడారం వద్ద ఎంతో సందడిగా వుండేది.

ఇలాకొన్నాళ్ళుజరిగాక,ఒకరోజునరంగయ్య, సాధువుతో, "ఇప్పటికే చాలా సంపాదించాం. ఇక నువ్వు పాపానంద స్వామి అవతారం చాలించడం మంచిది!" అన్నాడు.

సాధువు ఇందుకు ఒప్పుకోక,ఇంకా సంపాదించాలన్నాడు.

అయితే రంగయ్య, సాధువుతో, "అత్యాసకుపోతే వున్నదానికే మోసం వస్తుంది. ప్రపంచంలో మనమొక్కరిమే తెలివైనవాళ్ళం కాదు. ఇంకా చాలామంది వుంటారు. మన వంటి వాళ్ళు అద్భుతాలు ప్రారంభించగానే వాళ్ళకు అనుమానం వస్తుంది. అయితే, వేలంవెర్రి జనాలు వాళ్ళ మాటలు వినరు - ఆరంభంలో! ఆ వెర్రి తగ్గాక తెలివైన వాళ్ళు రంగంలో దిగి మన బండారం బయటపెడతారు. వ్యవహారాన్నంతవరకూ రానివ్వకు," అని హెచ్చరించాడు.

దీనికి సాధువు కోపం తెచ్చుకుని, "నిన్ను ముందు భాగస్థుడుగా చేర్చుకుని, తర్వాత





నా అంతవాణ్ణి చేసి, నేను మరొక చోటుకు తరలి పోదామనుకుంటూంటే — ఇదా నువ్వు నాకిచ్చే సలహా!" అని సంపాదించిన డబ్బు లెక్కించాడు. మొత్తం లక్ష రూపాయలని తేలింది.

సాధువు వాడికి యాభై వేల రూపాయలివ్వ బోయాడు. కానీ వాడా మొత్తం తీసుకోక, "నీ పాప భారంలో సగం నానెత్తికెత్త బోతు న్నావు, వద్దు! ఒక్క ఐదు వేలివ్వు,చాలు— కాస్త తేలిగ్గా వుంటుంది," అన్నాడు.

తర్వాత రంగయ్య, సాధువు ఇచ్చిన డబ్బు తీసుకుని వేషాన్ని కాస్త మార్చుకుని మేనమామ లోకనాథం వుండే త్రినాథపురం వెళ్ళాడు.

ఆ సమయంలో లోకనాథం కిరాణా దుకాణంలో వున్నాడు. మారువేషంలో వున్న తనను మేనమామ గుర్తుపడతాడో పట్టడో అని రంగయ్య దుకాణానికి వెళ్ళి, "నాకు ఎండు ఖర్జూరాలు కావాలి. ధర ఎంతైనా ఫరవాలేదు," అన్నాడు.

లోకనాథం వాడిని గుర్తుపట్టక, "ఇంకా మీకు ఏమైనా కావాలా, బాబూ?" అని అడిగాడు.

"చాలా పెద్ద జాబితాయే వుంది. ఎండు ఖర్జూరాలున్నదీ లేనిదీ చెప్పు," అన్నాడు రంగయ్య.

వెంటనే లోకనాథం, "ఒరేయ్ వెంకా!" అని పిలిచాడు. లోపలి నుంచి పదిహేనేళ్ళ కుర్రవాడు వచ్చాడు. లోకనాథం వాడిని ఎండు ఖర్జూరాలున్నాయా అని అడిగితే ఉన్నాయన్నాడు. రంగయ్యకు కావలసిన ఎండు ఖర్జూరాలు పొట్లం కట్టి ఇవ్వమని లోకనాథం చెప్పగానే, వాడు తిరిగి లోపలికి వెళ్ళిపోయాడు.

అప్పుడు లోకనాథం, "గోపీ!" అని పిలవగానే ఇంకొక కుర్రవాడొచ్చాడు.

వాడితో లోకనాథం, "బాబుగారికేం కావాలో తూకం తూచి పొట్లాలు కట్టు," అని చెప్పాడు.

కొంత సేపటికి వెంకడు వచ్చి, "బస్తాడు ఎండు ఖర్జూరాలుండాలి. ఎక్కడో కనబడ లేదు," అన్నాడు.

"ఆ ముక్క చెప్పడానికింతసేపా? బాబుగా రలా నిలబడి వుండి పోయారు కదా!" అని లోకనాథం విసుక్కుని, రంగయ్యతో, "మా దుకాణంలో లేని సరుకు మీకు మరెక్కడా దొరకదు.కాబట్టి మీ సమయం వృథా అయిం దనుకోనక్కర్లేదు," అన్నాడు.

"కానీ ఈ మాట కాస్త ముందే తెలిస్తే బాగుండేది. ముందు వున్నాయన్నాడు. తర్వాత లేవన్నాడు. వెతకడానికింతసేపా?" అన్నాడు రంగయ్య చిరాగ్గా.

"ఏం చేసేది, బాబూ?ఆ వెంకడికి అమ్మా నాన్నాలేరు. పొట్టగడిచేందుకు వేరే దారిలేదు. అడుక్కునేందుకు పౌరుషం. కష్టపడి పని చేసుకుని బ్రతుకుతానంటాడు. వాడికి పనె వరిస్తారు? వ్యాపారస్థుడికి కాస్త జాలి వుండాలి, బాబూ! అందుకే వాణ్ణి పనిలో పెట్టుకున్నాను. తప్పు నాది కాబట్టి వాడి వల్ల ఇబ్బంది కలి గితే మీబోటి వారు అనే మాటలు నేనే భరిం చాలి," అన్నాడు లోకనాథం.

రంగయ్య, "మహగొప్ప వ్యాపారివే!"అని మనసులో అనుకుని,"ఈవెంకడికి ఈ ఊళ్ళో లోకనాథం అనే వ్యాపారి అయినా తెలుసా? తెలిస్తే జాగ్రత్తగా ఈ పొట్లాలు ఆయనింటికి చేర్పించాలి. ఆయన నా మేనమామ," అని వెనక్కు తిరిగి అక్కణ్ణించి కదిలాడు.

లోకనాథం ఉలిక్కిపడి దుకాణంలోంచి బయటకువచ్చి,"ఒరే,రంగడివటరా, గుర్తుపట్ట లేకపోయాను. పద, ఇంటికిపోదాం," అన్నాడు.




రంగయ్య ఆశ్చర్యంగా, "దుకాణాన్నిలా వదిలేసి వచ్చేస్తావా?అసలే ఆవెంకడు తెలివి తక్కువవాడు," అన్నాడు.

లోకనాథం నవ్వి, "అదంతా ఇతరుల కోసంలే! ఆ వెంకడు మహా చురుకైనవాడు. నమ్మకస్థుడు. వాడి మూలంగానే ఈ ముసలి తనంలో కిరాణా దుకాణం నడపగల్గుతు న్నాను," అన్నాడు.

"అయితే మరి ఎందు ఖర్జూరాల విష యంలో అలా చేశాడేం?" అని అడిగాడు రంగయ్య అర్థంకాక.

"ఎందు ఖర్జూరాల కోసం వచ్చిన బేరాన్ని పోగొట్టుకోలేం కదా! నీకింకా చాలా సరుకులు కావాలి. వాటిని గోపీ చేత పొట్లాలు కట్టి

స్తూంటే, వీడు చక చకా ఎండు ఖర్జూరాల కోసం నాలుగు దుకాణాలూ తిరిగి వచ్చాడు. ఎక్కడా లేవు. జరిగిన ఆలస్యానికి నింద వాడి మీద పడింది," అన్నాడు లోకనాథం.

రంగయ్య కొంతసేపు ఆలోచిస్తూ వుండి, "అంటే వ్యాపారమూ మోసమే! అయినా వచ్చేది తక్కువ. నేను మరొకడితో కలిసి మోసం చేసి రెండు నెలల్లో సంపాదించింది, వ్యాపారంలో సంపాదించాలంటే ఏడాదిపైన పడుతుంది," అని తన కథంతా మేనమామకు చెప్పాడు.

లోకనాథం పెద్దగా నవ్వి,"సరుకుల్లో కల్తీ చేస్తే, అది మోసం. కొనేవాళ్ళ అసహాయత కనిపెట్టి ధరలు అదే పనిగా పెంచితే, అది మోసం. నేనలాంటి వ్యాపారం చేయడంలేదు. నా తెలివితో వచ్చిన వాళ్ళను ఆకట్టుకుంటు న్నాను," అన్నాడు.

రంగయ్య ఒక క్షణం ఆలోచించి, "ఇప్పుడు నా తెలివిని వ్యాపారానికి ఉపయో గించాలో, మోసానికుపయోగించాలో తెలి యడంలేదు. అదీ కాక సొంత తెలివితో రాణిస్తానని ప్రగల్భాలు పలికి ఇల్లు విడిచి వచ్చాను. ఇప్పుడు నీ సలహా తీసుకోవాలో కూడదో కూడా తెలియడం లేదు," అన్నాడు.

లోకనాథం మేనల్లుడి భుజంతట్టి, "మోసం చేసిడబ్బు సంపాదించడంలో నిజమైన తృప్తి వుండదు. నీ తెలివిని వ్యాపారానికే ఉపయో గించు. సామాన్యులకు సేవ చేయాలనే, అధిక లాభాలను ఆర్జించి పెట్టే నగల వ్యాపారాన్ని కొడుక్కిచ్చి, నేను కిరాణాదుకాణం నడుపుతున్నాను. ఇక నా సలహా సంగతం టావా? నువ్వు నన్నేం సలహా అడగలేదు. అడక్కుండా నేను నీకు సలహా ఇచ్చాను కాబట్టి, నువ్వు నా నుంచి ఇంకా ఇంకా వ్యాపార రహస్యాలు తెలుసుకుని రాణించ వచ్చు," అన్నాడు.

ఆ విధంగా రంగయ్య వ్యాపారంలో ప్రయోజకుడై, ఏడాది గడిచాక తల్లిదండ్రుల వద్దకు వెళ్ళి జరిగిందంతా చెప్పి వారిని సంతోష పెట్టాడు.

తర్వాత వల్లిని పెళ్ళి చేసుకుని మేనమామ నూసంతోషపెట్టి, తనూ సుఖంగా జీవించాడు.






[తొమ్మిదేళ్లపాటు ట్రోయ్ నగరంపై గ్రీకుల ముట్టడి సాగిందిగాని, చెప్పుకోదగిన యుద్ధం మటుకు జరగలేదు. ఇంతలో గ్రీకులలో అగ్రవీరుడైన వజ్రకాయుడు ట్రోయ్ నగరపు రాజ కుమార్తెను, ప్రమోదినిని చూసి, ప్రేమించాడు. గ్రీకుపక్షాన్ని విడనాడినట్లయితే అతనికి ప్రమోదిని లభించేటట్టు కనబడింది.వజ్రకాయుడు ఏదో నెపంమీద రారాజుతో తగాదా పెట్టుకుని యుద్ధరంగాన్ని విడిచిపెట్టి వెళ్లాడు.వెంటనే ట్రోజనులువిజృంభించి, అమితోత్సాహంతో గ్రీకుబలాలను భంగపరిచి, వారి నౌకలలో ఒకదానికి చిచ్చు పెట్టారు.అప్పుడు—]

చంద్రప్రభుడి నావ మండుతూండటం కంట పడగానే వజ్రకాయుడి రక్తం ఉడికిపోయింది. గ్రీకు పక్షాన తాను గాని తన బలాలు గాని ఇంక యుద్ధం చెయ్యబోవటం లేదన్న ప్రతిజ్ఞను అతను కొంతవరకు ఉపసంహరించుకుని, గ్రీకులకు సహాయంగా తన బలాలను అప్పటికప్పుడే పంపాడు.

ఈలోపుగా పితృకీర్తి అనే గ్రీకుయోధుడు విజృంభించే ట్రోజను బలాలలో పెద్ద కలవరం కలిగించాడు. మండిపోతున్న గ్రీకు నౌకను చుట్టుముట్టిన ట్రోజను సైనికుల మధ్యకు అతనొక శూలాన్ని బలంగా విసిరాడు. ఒక వీరుడికి తగిలి అతను కూలిపోయాడు. ఇది చూసి ట్రోజనులు వజ్రకాయుడి పనేననీ, అతను యుద్ధరంగానికి తిరిగి వచ్చాడనీ అనుకున్నారు. వజ్రకాయుడంటే ట్రోజనులకు సింహస్వప్నం; అందుచేత వారు కంగారుపడి చెల్లాచెదరై పారిపోసాగారు. ట్రోజనులకు




ధైర్యం చెప్పి నిలపగల యోధుడెవడూ లేక పోయాడు. దురదృష్టవశాత్తూ వీరసింహుడు భూధవుడిచేత గాయపడి అంతకు పూర్వమే యుద్ధరంగాన్ని విడిచి ట్రోయ్‌నగరానికి తిరిగి వెళ్ళిపోయాడు.

ట్రోజనులను ఈ విధంగా కలవరపరచిన పితృకీర్తి, చంద్రప్రభుడి నావతాలూకు మంటలను ఆర్పి, పారిపోతున్న ట్రోజనులను తరమసాగాడు. అతను వజ్రకాయుడి కవచం ధరించి ఉండటం మూలాన ట్రోజనులు అతన్ని చూసి వజ్రకాయుడనే భ్రమపడ్డారు.

ఎలాగైనా ఆ రోజు ట్రోయ్‌నగరాన్ని వశపరచుకోవాలని పితృకీర్తి తీర్మానించుకున్నాడు. నగరం చుట్టూ ఉన్న కోటగోడలను ఎగబాకటానికి అతను మూడుసార్లు విశ్వప్రయత్నం చేశాడు. కాని ట్రోజనులు ఈ ప్రయత్నాలను సాగనివ్వలేదు.

చీకటి పడినదాకా యుద్ధం సాగుతూనే ఉన్నది. మసకచీకటిలో పితృకీర్తి వెన్నులో ఎవరో పొడిచారు. అతని శిరస్త్రాణం పడిపోయింది, అతని చేతిలో ఉన్న శూలం విరిగిపోయింది, అతను అసహాయ స్థితిలో ఉండిపోయాడు. ఇది గమనించి మరొక ట్రోజను వీరుడు అతన్ని ఇంకొక పోటు పొడిచాడు. పితృకీర్తి బాగా దెబ్బతిని, నిరాయుధుడై, తూలుతూ యుద్ధరంగం నుంచి వెళ్ళిపోతూండగా, వీరసింహుడు యుద్ధరంగానికి తిరిగి వచ్చి పితృకీర్తిని ఒకే వేటుతో చంపేశాడు. తరవాత అతను పితృకీర్తి ధరించిన కవచాన్ని ఒలిచి తీసుకున్నాడు.

సరిగా ఈ సమయానికి, ప్రతాపుడూ, భూధవుడూ అక్కడికి వచ్చి పితృకీర్తి శవం ట్రోజనుల వశం కాకుండా, బాగా చీకటి పడేవరకూ కాపాడి, తరవాత దాన్ని తమ నౌకలవద్దకు చేర్చారు.

పితృకీర్తి మరణ వార్త విని వజ్రకాయుడు మట్టిలో పొర్లాడి ఆడదాని లాగా శోకాలు పెట్టాడు. అతని తల్లి అయిన తటిని అతని కోసం సరికొత్త కవచం ఒకటి అప్పటికప్పుడు తయారుచేయించి, అతని శిబిరానికి తెచ్చి ఇచ్చింది. వజ్రకాయుడు ఆ కవచాన్ని ధరించి రారాజు దగ్గరికి వెళ్ళి ఆయనతో రాజీపడ్డాడు.

తరవాత అతను పితృకీర్తి చావుకు పగతీర్చుకో వటానికై యుద్ధరంగానికి బయలుదేరాడు.

అసలే ఆగ్రహావేశంలో ఉన్న వజ్రకాయుడు ప్రళయరుద్రుడిలాగా యుద్ధరంగానికి వచ్చేసరికి ట్రోజనులు అతని ధాటికి నిలవలేక చెదిరి పరిగెత్తసాగారు. వజ్రకాయుడు వారిని స్కమందర్ నది కేసి తరిమాడు. అక్కడ ట్రోజను బలాలను రెండు కక్షలుగా చీలదీసి చిత్రవధ చేశాడు. ఆ యుద్ధంలో ఎలాగో చావు తప్పించుకుని ట్రోయ్‌నగరం చేరినవారు బెదిరిన లేళ్లలాగా కనిపించారు.

గ్రీకు వీరులందరిలోనికీ అగ్రగణ్యుడు వజ్రకాయుడు, ట్రోజనులలో అగ్రగణ్యుడు వీరసింహుడు. కాని వీరిద్దరూ ఇంతవరకు యుద్ధానికి తలపడలేదు, ఇప్పుడు తలపడ్డారు. వారి మధ్య జరిగే పోరు ఎలా పరిణమిస్తుందో, చూడటానికి ఉభయపక్షాల వారూ యుద్ధం నిలిపేశారు.

ఆరంభంలో వీరసింహుడు వజ్రకాయుణ్ణి ఎదిరించటానికి బదులు అతనినుంచి పారిపోసాగాడు. వజ్రకాయుడు అతని వెంటబడి తరమసాగాడు. ఇలా పారిపోవటంలో వీరసింహుడి ఉద్దేశమేమంటే, వజ్రకాయుడు చాలా కాలంగా యుద్ధానికి ఎడంగా ఉన్నందుచేత యుద్ధం చేసే అలవాటు తప్పివుంటుందనీ, తనవెంట పరిగెత్తిస్తే వజ్రకాయుడు త్వరలోనే అలిసిపోయి, ఆ తరవాత తన చేతిలో సులువుగా ఓడిపోతాడనీనూ!




కాని వీరసింహుడి అంచనా తప్పింది. అతను ట్రోయ్ గోడల చుట్టూ మూడుసార్లు పరిగెత్తించినప్పటికీ వజ్రకాయుడికి కొంచెమైనా అలసట రాలేదు. చివరకు వీరసింహుడు పరిగెత్తటం మానేసి, ఎదురుతిరిగి నిలబడ్డాడు. వజ్రకాయుడు అతని మీదికి వస్తూనే అతన్ని గుండెలు దూసుకుపోయేటట్టు గట్టిగా పొడిచాడు. వీరసింహుడు కిందపడి ప్రాణాలు విడవబోతూ, తన శరీరాన్ని తనవారికి వప్పగించమని వజ్రకాయుణ్ణి వేడుకున్నాడు.

కాని వజ్రకాయుడు వీరసింహుడి తుది కోరికను లక్ష్యపెట్టలేదు. అతను వీరసింహుడి కవచాన్ని ఒలిచి తీసుకుని, వీరసింహుడి

కాళ్ళను తాళ్లతో తన రథానికి కట్టి, ఆ రథాన్ని తమ నౌకలకేసి తోలుకు వెళ్ళాడు. వీరసింహుడి శవం మట్టిలో కొట్టుకుంటూ రథం వెంట వెళ్లింది.

ఈ విధంగా తన పగ తీరాక వజ్రకాయుడు పితృకీర్తికి అంత్యక్రియలు చేసి, అతని సమాధి వద్ద గుర్రాలనూ, పితృకీర్తి వెంట ఉండిన తొమ్మిది వేటకుక్కలలో రెండింటినీ, పన్నెండు మంది ట్రోజను యుద్ధ ఖైదీలనూ బలి ఇచ్చాడు. ఈవిధంగా బలి అయిన ట్రోజనులలో వర్ధనుడి కుమారులు చాలామంది ఉన్నారు. వీరసింహుడి శవాన్ని పితృకీర్తి వేట కుక్కలకు వేయాలని కూడా వజ్రకాయుడు ఆలోచించాడు గాని, మళ్ళీ ఆ ప్రయత్నం మానుకున్నాడు.

పితృకీర్తి అంత్యక్రియల సందర్భంలో పోటీపందాలు జరిగాయి. రథాల పోటీలో దేవమయుడు నెగ్గాడు. మల్లయుద్ధంలో రూపధరుడూ, భూధవుడూ సమ ఉజ్జీలుగా నిర్ణయించబడ్డారు.

ఇంత జరిగినా వజ్రకాయుడి పగపూర్తిగా చల్లారలేదు. అతను రోజూ తెల్లవారుజామునే లేచి వీరసింహుడి కళేబరాన్ని పితృకీర్తి సమాధి చుట్టూ మూడుసార్లు ఈడ్చేవాడు.

ఒకనాటి రాత్రి చీకటి మాటున, ట్రోయ్ రాజైన వర్ధనుడు గ్రీకు శిబిరానికి వచ్చి, తన కుమారుడి కళేబరాన్ని కొనుక్కునే ఉద్దేశంతో వజ్రకాయుడి గుడారంలోకి ప్రవేశించాడు. వర్ధనుడు వచ్చేసరికి వజ్రకాయుడు గాఢ నిద్రలో ఉన్నాడు. తలుచుకున్నట్టయితే



వర్ధనుడు వజ్రకాయుణ్ణి సులువుగా హత్యచేసి ఉండవచ్చు. కాని వర్ధనుడు ఆ పనిచెయ్యక ఎంతో ఉదారంగా ప్రవర్తించాడు.

వజ్రకాయుడు నిద్రలేచాక అతనికీ వర్ధనుడికీ సంప్రతింపులు జరిగాయి. వర్ధనుడు వజ్రకాయుడికి వీరసింహుడి యెత్తు బంగారం ఇచ్చి అతని కళేబరాన్ని తీసుకునేటట్టు నిర్ణయం జరిగింది. దీనికి ఉభయపక్షాలూ ఆమోదించిన మీదట, గ్రీకులు ట్రోయ్ కోట గోడల వెలుపల ఒక కాటా అమర్చారు, ఒకవైపున వీరసింహుడి కళేబరాన్ని పెట్టి రెండో వైపున బంగారం తెచ్చి వెయ్యమన్నారు.

ట్రోజనులు వర్ధనుడి ధనాగారంలో ఉన్న బంగారపు అచ్చులనూ, నగలనూ ఊడ్చి తెచ్చి కాటాలో వేశారు. కాని వీరసింహుడి శరీరమే కొద్దిగా మొగ్గుచూపింది. అప్పుడు వర్ధనుడి కుమార్తె ప్రమోదిని తన చేతి కంకణాలను ఊడ్చి కాటాలో వేసింది.

వజ్రకాయుడు అదివరకే ప్రమోదినిని అపారంగా ప్రేమించి ఉన్నాడు. అతనిప్పుడు ఆమె చేసినపని చూసి, వర్ధనుడి కేసి తిరిగి, "నాకు మీ బంగారం ఏమీ వద్దు. ప్రమోదినిని నాకిచ్చి పెళ్లిచేసి, భువనసుందరిని ప్రతాపుడి పరం చెయ్యండి; మనం యుద్ధం మాని సంధి చేసుకునేటట్టు నేను చూస్తాను!" అన్నాడు.

"కావలిస్తే ప్రమోదినిని నువ్వు పెళ్ళాడు. కాని భువనసుందరిని మీకు వప్పగించము. ఇష్టమైతే ఆప్రకారం సంధి ఏర్పాటు చెయ్యి!" అన్నాడు వర్ధనుడు.





"ప్రయత్నించి చూస్తాను!" అన్నాడు వజ్రకాయుడు.

వర్ధనుడు వీరసింహుడి కళేబరాన్ని తీసుకుపోయి యథావిధిగా అంత్యక్రియలు జరిపాడు. ఆ సమయంలో ట్రోజనుల రోదన ధ్వని మిన్నుముట్టింది. వీరసింహుడి మరణం వారందరినీ చాలా కలత పెట్టింది.

వజ్రకాయుడు ప్రమోదినిని పెళ్ళాడి యుద్ధాన్ని విరమించే ప్రయత్నానికి పూనుకోవటంలో తన చావును తానే కోరి తెచ్చుకున్నాడు. ఎలాగైనా యుద్ధం నిలిచి పోతుందనే ఉద్దేశంతో ప్రమోదిని ఈ ఏర్పాటుకు ఒప్పుకున్నదేగాని, ఆమె వజ్రకాయుణ్ణి మాత్రం క్షమించలేదు; ఎందుకంటే, అతను తన అన్న అయిన ఇలియుణ్ణి క్రూరంగా హత్యచేసి ఉన్నాడు.

ప్రమోదిని వజ్రకాయుడిపై ప్రేమ ఉన్నట్టు నటిస్తూ అతని ప్రాణ రహస్యం తెలుసుకున్నది. ఆమెపై ప్రేమకొద్దీ వజ్రకాయుడు తన కుడికాలి మడమలో చావు ఉన్న సంగతి చెప్పేశాడు. అతని తల్లి అతనిని బాల్యంలో, ఆ మడమ పట్టుకునే నదిలో ముంచింది.

"నీవు సూర్య ఆలయానికి నిరాయుధుడివై పాదరక్షలు లేకుండా వచ్చినట్టయితే అక్కడ సూర్యభగవానుడికి బలులు ఇచ్చి మన పెళ్ళి ఖరారు చేసుకుందాము!" అని ప్రమోదిని వజ్రకాయుడితో చెప్పింది.

వజ్రకాయుడు ఆ ప్రకారమే ఆలయానికి వచ్చాడు. అక్కడ ఆమె వెంట ఆమె ఆప్త బంధువులు కొందరున్నారు. ఆమె అన్న అయిన అరిభయంకరుడు వజ్రకాయుడిపై ఆపేక్ష ఉన్నట్టు నటిస్తూ అతనిని గట్టిగా ఆలింగనం చేసుకున్నాడు. అదే సమయంలో మోహనుడు విగ్రహం చాటు నుంచి వజ్రకాయుడి కుడికాలి మడమను ఒక విషపు బాణంతో కొట్టాడు. అయినా, వజ్రకాయుడు వెంటనే చావలేదు. ఆలయంలో ఉన్న అగ్నిగుండం నుంచి రెండు కొరవులు చెరొక చేతా తీసుకుని, వాటితో అతను అక్కడి ట్రోజనులను చావమోదాడు. ఆ దెబ్బలకు అనేక మంది ట్రోజనులూ, ఆలయంలో ఉండే పనివాళ్ళూ బలి అయ్యారు.

ఈలోపుగా గ్రీకు శిబిరంలో రూపధరుడు, భూధవుడు మొదలైన యోధులకు వజ్రకాయుదేదో కుట్ర చేస్తున్నట్టు అనుమానం తగిలింది. ప్రమోదినిని పెళ్ళాడి యుద్ధం నిలపటానికి అతను మాట ఇచ్చినట్టు వారెవరూ ఎరగరు. వజ్రకాయుడు సూర్యాలయానికి ఒంటరిగా బయలుదేరి వెళ్లినట్టు పసికట్టి గ్రీకు యోధులు కుట్ర ఏమిటో తెలుసుకుందామని అక్కడికి వచ్చారు.

వారు ఆలయద్వారం నుంచి లోపలికి వచ్చే సమయంలో మోహనుడూ, అరిభయంకరుడూ ఆ ద్వారంకుండానే బయటికి పోతూ ఎదురయ్యారు. రూపధరుడూ, భూధవుడూ, దేవమయుడూ ఆలయంలోకి వచ్చి కొనప్రాణంతో ఉన్న వజ్రకాయుణ్ణి చూశారు. "ట్రోయ్ నగరం వశమయ్యాక నా సమాధివద్ద ప్రమోదినిని బలి ఇవ్వండి! ఇదే నా తుది కోరిక!" అంటూ వజ్రకాయుడు తన అనుచరుల చేతులలో ప్రాణాలు వదిలాడు.

మహాబలుడైన భూధవుడు వజ్రకాయుడి శరీరాన్ని తన భుజాన వేసుకున్నాడు. ముగ్గురు యోధులూ ఆలయం వెలుపలికి వచ్చారు. వజ్రాయుడి శవాన్ని ఏవిధంగానైనా సంపాదించటానికి ట్రోజనులు విశ్వప్రయత్నం చేశారు. కాని గ్రీకువీరులు వారిని తరిమికొట్టి శవాన్ని తమ నౌకల వద్దకు చేర్చారు.

వజ్రకాయుడి తల్లి తటిని దుఃఖానికి అంతులేదు. ఆమెతోబాటు గ్రీకు యోధులందరూ పదిహేడు రోజులపాటు శోకం అనుభవించారు. పద్ధెనిమిదో రోజున వజ్రకాయుడి శవాన్ని చితిమీద కాల్చి, అతని అస్తికలనూ, పితృకీర్తి అస్తికలనూ చేర్చి ఒక బంగారు పాత్రలోనే ఉంచి, ట్రోయ్ నగరానికీ, సముద్రానికీ మధ్యగా ఒక స్థలంలో సమాధి చేసి, అక్కడ ఒక ఎత్తయిన రాళ్ళ గుట్ట ఏర్పాటు చేశారు. ఈ స్థలానికి సమీపంలోనే ఉన్న గ్రామానికి వజ్రకాయుడి పేరు పెట్టి, ఆ గ్రామంలో అతని పేర ఒక ఆలయం కట్టి, అందులో అతని శిలావిగ్రహాన్ని కూడా స్థాపించారు. చెవులకు స్త్రీలు ధరించే పోగులు గల ఈ విగ్రహం ఇప్పటికీ ఆ ఆలయంలో ఉన్నది. — (ఇంకావుంది)



# నగల వ్యాపారి

హేలాపురి నివాసి నాగభూషణం, తన కుమార్తె వివాహం అదే నగరానికి చెందిన గుణశేఖరుడనే అతడితో జరిపించాడు. ఆ వివాహ సమయంలో తీర్థయాత్రల్లో వున్న ఆయన స్నేహితుడు విశ్వ నాథుడు ఆయన్ని చూడడానికి వచ్చాడు.

"అమ్మాయివివాహానికిరాలేకపోయాను. అల్లుడేం చేస్తుంటాడు?" అని విశ్వనాథుడు అడిగాడు.

"బంగారు నగలు అమ్ముతుంటాడు," అన్నాడు నాగభూషణం విచారంగా.

"ఓహో, బంగారు నగల వ్యాపారం అన్నమాట! ఆ మాట చెప్పేందుకంత విచారపడతావెందుకు?" అంటూ విశ్వనాథుడు ఆశ్చర్యపోయాడు.

ఆ తర్వాత కొంతసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నాక, విశ్వనాథుడు కోరిన మీదట అల్లుడి చిత్ర పటం చూపించాడు నాగభూషణం.

ఆ సాయంత్రం విశ్వనాథుడు, తానెరిగిన కోదండయ్య అనే అతడి నగల దుకాణంలో ఉండగా, ఒక యువకుడు వచ్చి, రత్నాలహారాన్నొక దాన్ని అమ్మజూపాడు. అతణ్ణి చూస్తూనే నాగభూషణం అల్లుడని విశ్వనాథుడు గ్రహించాడు. ఇప్పుడు తను అమ్మజూపుతున్నది, నాగ భూషణం తన కూతురుకు చేయించిన నగల్లో ఒకటన్నమాట!

తన అల్లుడు బంగారు నగలు అమ్ముతూంటాడని, నాగభూషణం విచారంగా ఎందుకు చెప్పాడో అప్పుడర్థమైంది విశ్వనాథుడికి. — కోనే నాగవెంకట ఆంజనేయులు






# రాకుమారి తొందరపాటు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నువ్వు అనితర సాధ్యమైన పట్టుదలతో, పూనిన కార్యాన్ని ఫలింప చేసుకోవాలని, ఇంత అర్ధరాత్రివేళ భీతికొలిపే శ్మశానంలో ఇక్కట్ల పాలవుతూండడం ఎవరికైనా ఆశ్చర్యం కలిగిస్తుంది.కాని,ఇన్ని శ్రమల కోర్చి నువ్వు కార్యసాఫల్యం పొందాక, దానితో తృప్తి చెంది వుండగలవా? లేక స్వర్ణపురి రాకుమారిలా అవివేకంగా, అసందర్భంగా సాధించిన దాన్ని చేజేతులా జారవిడుచుకుంటావా, అన్న అనుమానం కలుగుతున్నది. ఎందుకంటే – కొన్నికొన్ని కార్యాలను సాధించడానికి కష్టసహిష్ణుతా, పట్టుదలా వుంటే సరిపోతుంది. అయితే, ఫలితాన్ని అనుభవించడానికి వివేకం, లోకజ్ఞతా అవసరం అవు

## బేతాళ కథలు




తుంది. ఇందుకు ఉదాహరణగా, స్వర్ణపురి రాకుమారి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం ఒకసారి తూర్పు సముద్ర తీరపు కొండ ప్రాంతాల ఎడతెరిపి లేని వర్షపాతంతో పాటు పెను తుఫాను గాలులు చెలరేగినై. ఆ సమయంలో కూలిపోయిన కొండ చరియల్లో ఒకచోట, అతి ప్రాచీనమైన శివాలయం ఒకటి బయల్పడింది. ఈవార్త ఆ ప్రాంతాన్ని పాలించే స్వర్ణపురి రాజు శూరవర్మకు తెలియవచ్చింది.

శూరవర్మ కుమార్తె సులక్షణ గొప్ప శివభక్తురాలు. ఆమె, తండ్రితో, "నాన్నగారూ! తుఫాను తాకిడికి బయల్పడిన ఆ పురాతన శైవాలయం, మన రాజధానికి అతి సమీపంలో వుండడం మన అదృష్టం. నా పర్యవేక్షణలో అక్కడ నాలుగైదు మాసాల్లో శివుడికి అద్భుతమైన ఆలయాన్ని పునర్నిర్మిస్తాను," అన్నది అమితానందంగా.

శూరవర్మ తన అంగీకారం తెలిపాడు. మంచి ముహూర్తాన శివాలయపునరుద్ధరణ కార్యక్రమం ప్రారంభమైంది. సులక్షణ రోజులో చాలాభాగం పనివాళ్ళకూ,శిల్పులకూ సూచనలిస్తూ, ఆ కొండ వద్దనే గడిపేది.

ఒకరోజు మధ్యాహ్నం విశ్రాంతి తీసుకుంటున్న ఆమెకు, అతి మనోహరమైన మురళీ గానం దూరం నుంచి వినవచ్చింది. అందరూ ఎవరి పనుల్లో వాళ్ళున్నారు. ఆమె గానం వస్తున్న దిశగా వెళ్ళింది. ఒకచోట పచ్చిక మైదానంలో కొన్ని గొర్రెలు మేస్తున్నవి. పాతికేళ్ళ యువకుడొకడు ఒక చెట్టు కింద కళ్ళు మూసుకు కూర్చుని తన్మయత్వంతో మురళిని వాయిస్తున్నాడు. అతడి అందం చూసి సులక్షణ అమితాశ్చర్యం చెందింది.

పాట పూర్తి చేసి కళ్ళు తెరిచిన యువకుడు, ఎదురుగా నిలబడి వున్న సులక్షణను చూసి ఉలిక్కి పడ్డాడు. ఆమె చిన్నగా నవ్వి, "నేను రాకుమారి సులక్షణను. నీ మురళి పాటను మెచ్చాను. నీ పేరేమిటి?" అని అడిగింది.

"నా పేరు గోవిందస్వామి!"అని ఆయువకుడు, సులక్షణకు నమస్కరించి గొర్రెలను తోలుకుని వెళ్ళిపోయాడు.



అది మొదలు సులక్షణ రోజూ రహస్యంగా గోవిందస్వామిని కలుసుకుని, మురళి మీద తనకు నచ్చిన పాటలు పాడించుకునేది. గోవిందస్వామి ఆమెకు మురళి వాయించడం నేర్పేవాడు. ఆమె అతడికి నాగరికపు ప్రవర్తనా, ఎదుటివారితో మాట్లాడవలసిన తీరూ నేర్పేది. నెల తిరిగే సరికి ఇద్దరూ చాలా సన్నిహితుల య్యారు.

ఒకనాడు కొద్దిసేపు మురళి వాయించగానే సులక్షణకు పొలమారి దగ్గు వచ్చింది. అది చూసి గోవిందస్వామి, ఆమెతో, "ఇక్కడికి దగ్గరలోనే చిన్నతనం నుంచీ నేనెరిగిన అవ్వ వున్నది. ఆమె గుడిసె వెనక వున్న బావినీళ్ళు కొబ్బరిబొండాం నీళ్ళలా తియ్యగావుంటాయి," అని, సులక్షణను కొండ మలుపులో బాట పక్కనేవున్న అవ్వ గుడిసె దగ్గరకు తీసుకు వెళ్ళాడు.

చుట్టూ పచ్చని చెట్లతో, పూలమొక్కలతో పర్ణశాలలా వున్న అవ్వగుడిసె చూసి సులక్షణ ఆశ్చర్యపోయింది. కాళ్ళ సవ్వడి విని గుడిసె లోంచి బయటికి వచ్చిన అవ్వ, సులక్షణను చూసి, "ఎవరమ్మా నువ్వు? ఏమనుకోకు. మా గోవిందు అందానికి దీటైన అందగత్తెను ఇన్నాళ్ళకు చూశాను," అన్నది బోసినోటితో నవ్వుతూ.

ఇది విన్న సులక్షణకు సిగ్గు ముంచుకు వచ్చింది. గోవిందస్వామి చెప్పగా అవ్వగుడిసె లోకి పోయి, ఒక లోటాలో నీళ్ళు తెచ్చి సులక్షణకుఇచ్చింది. సులక్షణ నీళ్ళుతాగి, అవ్వతో, "నీ గుడిసె ముందు నేనేనాడూ ఎరగని కమ్మని పూలవాసన, అవ్వా! ఇక్కడ నాకెంతో హాయిగా వున్నది," అన్నది.

"ఇది పొగడ పూల సువాసన!" అంటూ అవ్వ కిందరాలిన పొగడ పూలు ఏరి దండ గుచ్చి, ఎంతో సంతోషంగా సులక్షణ తలలో తురిమింది.

ఆ తర్వాత గోవిందస్వామి,ఆమెను వెంట బెట్టుకుని కొండ మలుపు దాకా వచ్చి, అక్కడ దిగవిడిచి గొర్రెలను తోలుకునివెళ్ళిపోయాడు. ఆ రోజే తను పెళ్ళంటూ చేసుకుంటే, గోవింద స్వామినే చేసుకోవాలని సులక్షణ నిర్ణయించు కున్నది.



ఆరాత్రి ఆమె మందిరంలోకి రాజు శూర వర్మ వచ్చి, "అమ్మా! ఉదయగిరి యువ రాజు మణిదత్తుడు నిన్ను వివాహమాడదలచి నట్టుగా వర్తమానం పంపించాడు. అతడు అన్ని విధాలా తగినవాడో కాదో చూడాలిగదా. అందువల్ల, రెండు రోజుల పాటు మన అతిథిగా గడిపివెళ్ళమని ఆహ్వానం పంపించాను. అతను రేపు సాయంకాలానికి నగరానికి వస్తాడు," అని చెప్పాడు.

ఆ సమయంలో, గోవిందస్వామి ప్రస్తావన తండ్రి ముందుతీసుకురావడానికి సులక్షణకు ధైర్యం చాలలేదు.

మర్నాటి మధ్యాహ్నం సులక్షణ, గోవింద స్వామికి సంగతి చెప్పి, "ఆ యువరాజు మణిదత్తుడికి నేను నచ్చి తీరుతాను. ఒకవేళ తొందరపడి, మానాన్న అతడికి మాట ఇస్తే, ఆ తర్వాత దానికి తిరుగుండదు," అన్నది దిగులుగా.

"అవ్వను సలహా అడుగుదాంపద!" అన్నాడు గోవిందస్వామి.

ఇద్దరూ అవ్వగుడిసెకు వెళ్ళారు. సులక్షణ, అవ్వకు జరిగింది చెప్పి, "మా నాన్న నా ఇష్టాన్ని కాదనడు. గోవిందస్వామి అన్ని విధాలా మా నాన్నకు నచ్చుతాడనే నమ్మకం నాకున్నది. అయితే, గోవిందస్వామిని మా నాన్న దగ్గరకు తీసుకువెళ్ళే ధైర్యం నాకు లేదు," అన్నది.

అవ్వ కొంచెంసేపు ఆలోచించి, "ఇందులో మనం భయపడవలసిందీ, మతులు చెడగొట్టుకోవలసిందీ ఏమీ లేదు. గోవిందస్వామి, గోవిందస్వామిగా కాక, యువరాజు మణిదత్తుడుగా వెళ్ళి మీ నాన్నను కలుసు కుంటాడు. గోవిందుడు మీ నాన్నకు నచ్చుతాడనే నమ్మకం నీకున్నది కదా! ఇకనేం, కథ సుఖాంతం," అన్నది.

ఉదయగిరి యువరాజు నగరం చేరాలంటే, కొండ వారగా వున్న మార్గం తప్ప మరొక మార్గం లేదు. అతను తన గుడిసె ముందుకు రాగానే ఏం చేయాలో, గోవింద స్వామికి వివరించింది అవ్వ.

అనుకున్నట్టుగానే, సాయంత్రానికి తెల్లని అశ్వం మీద రాచదుస్తుల్లో మణిదత్తుడు ఆ ప్రాంతానికి వచ్చాడు.

అవ్వ అతడికి ఎదురుపోయి, "నాయనా, నాగన్నా! నా మాటవిను. భోజనం చేసివెళ్ళు," అంటూ గుర్రానికి అడ్డుగా నిలబడి దుఃఖం నటించింది.

ఇది విని మణిదత్తుడు చాలా ఆశ్చర్య పోతూ, "అవ్వా! నేను నువ్వనుకునే నాగన్నను కాదు! ఉదయగిరి యువరాజు మణి దత్తుణ్ణి!" అంటూ గుర్రంమీది నుంచి కిందికి దిగాడు.

అక్కడే వున్న గోవిందస్వామి, మణిదత్తుణ్ణి పక్కకు తీసుకుపోయి, "అయ్యా! ఈ అవ్వ ఒక్కగానొక్క మనవడు నాగన్న. వాడు రాజు గారి సైనికుడు. ఎన్నో ఏళ్ళ నాడు పొరుగు రాజు ఈ రాజ్యం మీద దండెత్తాడు. రాజాజ్ఞగా దండోరా వింటూనే–భోజనం చేస్తున్న నాగన్న, అవ్వ ఎంత బతిమాలినా వినకుండా, గోడకు వేళ్ళాడుతున్న కత్తి తీసుకుని బయటికి పరి గెత్తాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో వాడు మరణించాడు. అవ్వకు మతి చలించింది. మీలో నాగన్న పోలికలుండి వుండాలి! ఈపూట అవ్వ వడ్డించగా భోజనం చేస్తే, ఈ ముసలి తనంలో ఆమెకు ఎంతో తృప్తి కలిగించిన వారవుతారు," అని ఒక కట్టుకథ కల్పించి చెప్పాడు.

జాలీ, దయాగుణం గల మణిదత్తుడు వెంటనే అవ్వ భుజం మీద చెయ్యివేసి, "అవ్వా! నన్నాకలి దహించేస్తున్నది. అన్నం పెట్టు," అన్నాడు.

అవ్వ వెంటనే అతడికి అన్నం, కూరలూ వడ్డించింది. మణిదత్తుడు ఇష్టం లేకపోయినా





తృప్తి నటిస్తూ భోజనం ముగించి, దాపుల వున్న మంచం మీద కూర్చున్నాడు. అవ్వ అతడికి ఒక లోటాలో వేడిపాలుతెచ్చిఇచ్చింది. ఆ పాలు తాగి మణిదత్తుడు క్షణాల మీద నిద్రలోకి జారుకున్నాడు.

అప్పుడు అవ్వ, గోవిందస్వామితో, "ఆ పాలల్లో కొన్ని మూలికల రసం కలిపాను. యువరాజుకు రేపు సాయంకాలానికి గాని స్పృహ రాదు. నువ్వు, ఈయన దుస్తులు ధరించి, అశ్వంమీద రాజభవనానికి వెళ్ళు," అన్నది.

గోవిందస్వామి, మణిదత్తుడుగా రాజ భవనంలో ప్రవేశించాడు. అందమైన నిలు వెత్తు గోవిందస్వామిరూపంరాజుశూరవర్మను ఆకట్టుకున్నది. ఆయన, కుమార్తెతో, "నువ్వు అదృష్టవంతురాలివి, తల్లీ! నీ కాబోయే భర్త అచ్చు మన్మథుడిలావున్నాడు,"అంటూ, ఆమె తల నిమిరాడు.

సులక్షణ పరమానంద భరితురాలైంది. మర్నాడు సాయంత్రం నదిలో నౌకావిహారానికి ఏర్పాట్లు చేశాడు శూరవర్మ.

విహారానికి బయలుదేరే ముందు ఒక పరిచారిక సులక్షణ మందిరంలోకి వచ్చి, "అమ్మా! మీకోసం ఎవరో ముసలిది పొగడ పూలదండ తెచ్చింది. దాన్ని స్వయంగా తనే మీకివ్వాలని పట్టుబడుతున్నది," అనిచెప్పింది.

పొగడదండ పేరు వింటూనే, ఆ వచ్చిన దెవరో గ్రహించిన సులక్షణ, పరిచారికతో ఆ ముసలిదాన్ని లోపలికి పంపించమన్నది. అవ్వ వస్తూనే, "రాకుమారీ! ఆ యువరాజుకు ఒళ్ళు కాలిపోయే జ్వరం వచ్చింది. విరుగుడు మందుఇచ్చినా స్పృహరాలేదు. నువ్వు ఆస్థాన వైద్యుడిని తీసుకుని వెంటనేరావాలి," అన్నది ఆందోళనగా.

అవ్వను పంపేసి, సులక్షణ ఉద్యానవనం లోతిరుగుతున్న గోవిందస్వామిని కలుసుకుని, జరిగింది చెప్పి, "నేను నౌకావిహారానికి రాను. వైద్యుణ్ణి వెంటబెట్టుకుని అవ్వఇంటికి వెళు తున్నాను," అని చెప్పింది.

"ఆ యువరాజుకు తీవ్రజ్వరం, స్పృహ లేదంటూ నువ్వు గొడవ పడిపోవడం ఆశ్చ ర్యంగా వుంది! ఏమైనా, నువ్వు నౌకావిహారా

నికి రాకపోతే ఏమీ బావుండదు," అన్నాడు గోవిందస్వామి నిరుత్సాహంగా.

సులక్షణ మౌనంగా అక్కడి నుంచి బయలుదేరి, రాజవైద్యుణ్ణి వెంటబెట్టుకుని అవ్వ గుడిసెకు వెళ్ళింది.

వైద్యుడు స్పృహలేని స్థితిలో వున్న మణిదత్తుడి నుదుటికి ఏవో లేపనాలు పట్టించి, "రోగికి ఒకటి రెండు గంటల్లో స్పృహవస్తుంది, భయపడవలసిందేమీ లేదు. తర్వాత ఈ రెండుమాత్రలూమింగించమ్మా,"అనిసులక్షణకుచెప్పాడు.

తరవాత ఆయన ఈ జరిగినదంతా వింతగానూ, అనుమానాస్పదంగానూ తోచడంతో, సరాసరి రాజు శూరవర్మ దగ్గరకు పోయి సంగతంతా వివరించాడు.

వెంటనే శూరవర్మ కొద్ది పరివారాన్నీ, రాజవైద్యుణ్ణీ తీసుకుని అవ్వ గుడిసెకు వచ్చాడు. ఆ సమయంలో మణిదత్తుడు కొంత స్పృహ రావడంతో మెల్లగా ఏదో మాట్లాడుతున్నాడు.

సులక్షణ కన్నీళ్ళు తుడుచుకుంటూ శ్రద్ధగా వింటున్నది.

శూరవర్మ, ఏమిటిదంతా అన్నట్టు కుమార్తె కేసి చూశాడు. ఆమె, తండ్రి చేయి పట్టుకుని పరివారం నుంచి దూరంగా తీసుకుపోయి, జరిగినదంతా పూస గుచ్చినట్టు చెప్పి, "నా ప్రోద్బలం మీద గోవిందస్వామి యువరాజు వేషంలో మన భవనానికి వచ్చాడు. హఠాత్తుగా



అనారోగ్యంపాలయి యువరాజు ఇక్కడ చిక్కు పడ్డాడు," అన్నది.

శూరవర్మకు, గోవిందస్వామి అన్నివిధాలా నచ్చి వుండడంతో, ఆయన కుమార్తెపై కోపగించుకోక, "ఇటువంటి తొందరపాటు నిర్ణయాలుఅన్నివేళలాసత్ఫలితాలనివ్వవు.ముందు నువ్వు మణిదత్తుడికి క్షమాపణలు చెప్పుకో! నువ్వు గోవిందస్వామిని వివాహమాడేందుకు నాకెలాంటి అభ్యంతరమూ లేదు," అన్నాడు.

"క్షమించండి, నాన్నగారూ! నా తొలి నిర్ణయంతొందరపాటు వల్ల జరిగిందని గ్రహించాను. నేను మణిదత్తుడికి క్షమాపణ చెప్పుకుంటాను. కాని అది, గోవిందస్వామిని వివాహమాడేందుకు మాత్రం కాదు; మణి

దత్తుణ్ణి వివాహమాడేందుకే! నా కాబోయే భర్త భవిష్యత్తులో ఈ రాజ్యానికి రాజవుతాడు. ప్రజాక్షేమం, రాజ్యరక్షణా అన్నిటికన్న ముఖ్యం కదా!" అన్నది సులక్షణ.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రాకుమారి సులక్షణకు మొదట్లో, తను గోవింద స్వామిని వివాహమాడడం, తనతండ్రికి ఇష్టం కాదేమో అన్న భయం వున్నది. కాని, అతణ్ణి వివాహమాడేందుకు తండ్రి తన పూర్తి ఇష్టాన్ని తెలియబరిచాడు. అయినా, ఆమె గోవింద స్వామిని నిరాకరించి, మణిదత్తుణ్ణి వివాహమాడగోరడం అవివేకంగానూ, అసందర్భంగానూ లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "గోవిందస్వామి స్వయం ఆలోచనాశక్తి లేనివాడు, పైపెచ్చు స్వార్థపరుడు. ముక్కూ ముఖం ఎరగని ఒక ముసలిదాన్ని సంతృప్తి పరిచేందుకు మణిదత్తుడు, తను రాజభవనానికి వెళ్ళడం కూడా వాయిదా వేసుకున్నాడు. దీనిని బట్టి అతడిది ఎదుటివారి కష్టాలకు చలించే జాలిగుండె అని తెలుస్తున్నది. ఇది ప్రజాపాలకుడైనవాడి కుండవలసిన ప్రధాన లక్షణం. ఇక, గోవింద స్వామి మనస్తత్వం ఇందుకు పూర్తిగా విరుద్ధం. అతడు తను స్వార్థం కొద్దీ అల్లిన కట్టుకథ కారణంగా, మణిదత్తుడు అస్వస్థుడై స్పృహ కోల్పోయిన స్థితిలో వున్నాడని తెలిసీ చలించలేదు. పైగా, రాకుమారి సులక్షణను తనతో పాటు నౌకావిహారానికి రావలసిందిగా కోరాడు. అటువంటి స్వార్థపరుడు, దయా జాలీ అంటే ఏమిటో తెలియనివాడు తన భర్త అయి, ఆతర్వాత దేశానికి రాజయితే ప్రజలు ఎన్ని ఇక్కట్లకు గురి అవుతారో సులక్షణ గ్రహించింది. అందుకే,ఆమె గోవిందస్వామిని నిరాకరించి మణిదత్తుణ్ణి వివాహమాడదలచింది. ఇది ఎంతో వివేకవంతమైన సందర్భోచిత నిర్ణయం," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : మాచిరాజు కామేశ్వరరావు రచన]



## మన దేశపు కోటలు - 2



ఢిల్లీలో ఉన్నన్ని కోటలు మన దేశంలో మరే నగరంలోనూ లేవు. పాండవుల రాజధాని ఇంద్రప్రస్థం ఇక్కడే ఉండేదని చెబుతారు. కాని, దానిని నిరూపించడానికి తగిన ఆధారాలు ఇంకా లభించలేదు. అయితే, ఇప్పుడు కుతుబ్‌మీనార్ ఉన్న ప్రాంతంలో అనంగపాలుడనే తోమార రాజు క్రీ.శ. 737వ సం॥లో లాల్‌కోటను నిర్మించాడన్న విషయం మాత్రం రూఢిగా చెప్పవచ్చు. ఆ తరవాత నాలుగు వందల సంవత్సరాలకు, అదే స్థలంలో పృథ్వీరాజ్ చౌహాన్ మరొక కోటను నిర్మించాడు. పృథ్వీరాజును రాయ్ పిథోరా అని పిలిచేవారు. అందువల్ల ఈ కోట కూడా ఖిలా రాయ్ పిథోరాగా ప్రసిద్ధి గాంచింది.

# లాల్ కోట నుంచి లాల్ ఖిల్లా వరకు

రచన : మీరా ఉగ్రా
చిత్రాలు : గౌతమ్ సేన్

క్రీ.శ. 1303వ సం॥లో అల్లాఉద్దీన్ ఖిల్జీ, కోషక్-ఇ-సిరి అనే సిరికోటను నిర్మించాడు. 1982వ సం॥లో ఇక్కడే ఆసియా క్రీడలు జరిగాయి. ఖిల్జీ వంశానంతరం తుగ్లక్ వంశస్థులు అధికారంలోకి వచ్చారు. మంగోలుల దండయాత్రల నుంచి రక్షణకు ఘియాసుద్దీన్, మహమ్మద్, ఫిరోజ్ షా అనే ముగ్గురు తుగ్లక్ వంశపు రాజులు విడివిడిగా తుగ్లకాబాదు, అదిలాబాదు (జహాన్ పనాహ్), ఫిరోజ్ షా కోట్లా అనే మూడు కోటలను నిర్మించారు. ఈనాడు ఎత్తయిన గోడలూ, బురుజులూ మాత్రమే వాటి గుర్తులుగా మిగిలి ఉన్నాయి.

◀ తుగ్లకాబాద్

 

ఈనాడు పురాణా ఖిల్లా అని పిలువబడుతూన్న కోట నిర్మాణం, రెండవ మొగలు చక్రవర్తి అయిన హుమయూన్ చేత ప్రారంభించబడి, షేర్‌షా సూర్ చేత పూర్తి చేయబడింది. అక్బర్ తన రాజధానిని ఆగ్రాకు మార్చాడు. ఆయన బాదల్ ఘడ్ అనే కోటను చేపట్టి, దానిని మరింత పటిష్ఠం చేశాడు. ఎర్ర ఇసుకరాళ్ళతో నిర్మించడం వల్ల దానికి లాల్ ఖిల్లా (ఎర్రకోట) అనే పేరు వచ్చింది. విలక్షణమైనదీ, చాలా పటిష్ఠమయినదీ



▲ పురాణా ఖిల్లా

లాల్ ఖిల్లా, ఆగ్రా

అయిన ఈ కోటకు రెండు అగడ్తలూ, రెండు ప్రహరీ గోడలూ ఉన్నాయి.

◄ నిర్మాణంలో లాల్ ఖిల్లా (అక్బర్‌నామాలోని చిత్రం)

అక్బర్ మనమడయిన షాజహాన్ కొలువులోని అమర్‌సింగ్ రాథోడ్ అనే రాజపుత్ర సేనా నాయకుడు ఈ కోట నుంచి సాహసోపేతంగా తప్పించుకుపోయాడనడానికి ఆధారం ఉన్నది. తనపై తరచూ కుట్ర పన్నుతూన్న సలావత్ ఖాన్ అనే కోశాధికారిని, అమర్‌సింగ్ రాథోడ్ ఒకసారి ఆగ్రహావేశంతో చంపేశాడు. షాజహాన్ సైనికులు తరమడంతో, అతడు పారిపోతూ, ప్రధాన ద్వారం మూసి ఉండడంతో, గుర్రంతో సహా మెట్ల మీదుగా కోట బురుజుల మీదికి ఎక్కి, 30 అడుగుల ఎత్తయిన గోడపై నుంచి వెలుపలికి దూకి తప్పించుకున్నాడు. ఆ కారణం వల్ల, అంతవరకు అక్బారీ దర్వాజాగా వున్న ద్వారం ఆనాటి నుంచి అమర్‌సింగ్ దర్వాజా అయింది.



◀ అమర్‌సింగ్ దర్వాజా

▼ దివాన్-ఇ-ఆమ్ (సభామంటపం) లాల్ ఖిల్లా, ఢిల్లీ



షాజహాన్ రాజధానిని మళ్ళీ ఢిల్లీకి మార్చాడు. షాజహానాబాదులో 1639వ సం॥ మే 12వ తేదీ ఒక కోట నిర్మించడం ప్రారంభించాడు. ఆగ్రా కోటలాగే దీనిని కూడా ఎర్ర ఇసుకరాళ్ళతో నిర్మించడం వల్ల దీనికి లాల్ ఖిల్లా అని పేరు వచ్చింది. 1648వ సం॥ ఏప్రిల్ 18వ తేదీ షాజహాన్ చక్రవర్తి ఇందులో ప్రప్రథమంగా అత్యంత వైభవంగా కొలువు తీరాడు.

మయూరసింహాసనం మృదువైన పట్టు జలతారులతో, బంగారు వెండి దారాలతో కప్పబడి చూపరుల కళ్ళకు మిరమిట్లు కొలిపేలా ఉండేది. "ఈ భూమి మీద స్వర్గం అంటూ ఉంటే అది ఇక్కడే! అది ఇక్కడే! అది ఇక్కడే!" అనే ఫిరదౌసి మాటలను షాజహాన్ కుమారుడు దారా షుకో మయూరసింహాసనం మీద బంగారు అక్షరాలతో చెక్కించాడు.

ఔరంగజేబు అనంతరం వచ్చిన మొగలు చక్రవర్తులకు ఆ స్వర్గం కాస్తా నరకంగా మారింది. మొగలు సామ్రాజ్య పతనంతో కోట, దండెత్తి వచ్చిన నాదిర్ షా, అహమద్ షా అబ్దాలీ మొదలైన వారి వశమయింది.



◀ బహదూర్ షా జాఫర్

1857-58 మధ్య సిపాయిలు, ఈస్ట్ ఇండియా కంపెనీపై తిరుగుబాటు జరిపి, వృద్ధుడయిన బహదూర్ షా జాఫర్‌ను తమ రాజుగా ప్రకటించడంతో రక్తపాతం జరిగింది. తిరుగుబాటు అణచబడింది. ఆ కోటలోనే బ్రిటిష్ వాళ్ళు బహదూర్ షా మీద విచారణ జరిపారు. దోషి అని నిర్ణయించి, నిర్బంధ ప్రవాస జీవితం శిక్షగా విధించి బహదూర్ షాను బర్మాకు తరలించారు.

1947వ సం॥ ఆగస్టు 15వ తేదీ మన దేశం స్వతంత్రమయ్యాక, బ్రిటిష్ జెండా యూనియన్ జాక్‌ను దించి, పండిత జవహర్ లాల్ నెహ్రూ మన త్రివర్ణ జాతీయ పతాకాన్ని ఎర్రకోట మీద ఎగురవేశారు!

లాల్‌కోట నుంచి లాల్ ఖిల్లా వరకు సాగిన చరిత్రలో ఒక అధ్యాయం పూర్తయింది!



◀ లాల్ ఖిల్లా, ఢిల్లీ




నందుడనే యువకుడు బాగా చదువుకున్నాడు. ఉద్యోగం లేదు. డబ్బు సంపాయించమని తల్లిదండ్రులు పోరుతున్నారు. సంపాదించడం లేదని అన్నలు, వదినలు గేలిచేస్తున్నారు. వాడితో అభిమానంగా మాట్లాడేది పొరుగింటి రాధ ఒక్కతే!

రాధ తండ్రికి బాగా డబ్బుంది, పలుకుబడి వుంది. ఆమె, తల్లిదండ్రులకు ఒక్కగానొక్క కూతురు.

రాధను పెళ్ళి చేసుకుంటే తను గొప్పగా వెలిగిపోవచ్చునని నందుడు అనుకున్నాడు. ఒకరోజున వాడు రాధను పెళ్ళి గురించి అడిగాడు. ఆమె నవ్వి, "నాకు నువ్వంటే ఇష్టమే కానీ నిన్ను పెళ్ళి మాత్రం చేసుకోను. నా డబ్బు గురించి ఆశపడకుండా, తనకు తానుగా బాగా డబ్బు సంపాదించగలవాడినే నేను పెళ్ళి చేసుకుంటాను. నువ్వు మంచి వాడివే కానీ అసమర్థుడివి!" అని చెప్పింది.

ఈ మాటలతో నందుడికి జీవితంపై విరక్తి పుట్టింది. చావాలని వాడు పక్కనే వున్న అడవిలోకి వెళ్ళి, ఒక చెట్టుకు ఉరితాడు వేలాడదీసి కళ్ళు మూసుకుని దైవప్రార్థన చేసుకోసాగాడు.

ఇంతలో అలా దారిన వెళుతూన్న సిద్ధుడనే పెద్దమనిషి నందుణ్ణి వారించి, వాడి కథ అడిగి తెలుసుకున్నాడు. తర్వాత చిరునవ్వు నవ్వి, "ఈ అడవిలో సాధుజంతువులు, క్రూరజంతువులు ఎన్నో వున్నాయి. సాధుజంతువులకు, క్రూరజంతువుల భయం. క్రూరజంతువులకు వేటగాళ్ళ భయం. అన్ని జంతువులకూ ప్రకృతిబీభత్సాల భయం. మంటలు చెలరేగినా, వరదనీరు ముంచినా, జబ్బులు చేసినా వాటికి రక్షణ లేదు. అనుక్షణం ప్రాణభయంతో వుంటూనే, అవి ఎంతో ఉత్సాహంగా కనిపిస్తాయి. తిండి, నిద్ర తప్ప వాటికి వేరే పని లేకపోయినా

జొన్నలగడ్డ రామలక్ష్మి



వుండలేకపోతే, ఈ అడవిలో వుండు. ఇక్కడ కందమూలాలున్నాయి. ఫలవృక్షాలున్నాయి. అవి తింటూ పొట్టపోసుకోవచ్చు. కానీ ఇక్కడ ప్రతి నిమిషం ప్రాణభయం. మనిషి, మనిషికి చేసిన సదుపాయాలేమిటో, వాటి విలువ ఎంత గొప్పదో తెలుసుకోవాలంటే అడవిలో వుండాలి. అప్పుడే నీకు తోటి మనుషుల పట్ల గౌరవభావం ఏర్పడుతుంది. లేదంటావా, నాతో పట్నం రా! అక్కడ నీకు ఏదో దారి కనబడకపోదు," అన్నాడు.

అడవిలో వుండడం ఇష్టం లేని నందుడు, సిద్ధుడితో బయలుదేరాడు. వాళ్ళు అడవి దాటి ఒక ఊరు చేరుకుని సత్రంలో బస చేశారు.

అవి అంత చలాకీగా వున్నప్పుడు, తన ఆలోచనాశక్తితో ఎన్నో సాధించాల్సిన మనిషి ఇలా చిన్నతనంలోనే ఆత్మహత్య చేసుకోవాలనుకోవడం సిగ్గుచేటు కదా!" అన్నాడు.

నందుడు సిగ్గుపడుతూనే, "తమరు జ్ఞానిలా వున్నారు. నా అసమర్థతను చక్కగా వివరించారు. కానీ, డబ్బు సంపాయించడం ఎలాగో నాకు తెలియడం లేదు," అన్నాడు.

దానికి సిద్ధుడు, "డబ్బు సంపాయించాలంటే లక్ష మార్గాలున్నాయి. ఇతరుల మీద ఆధారపడిన వాళ్ళకు గౌరవముండదు. కలో గంజో తాగి స్వతంత్రంగా బ్రతుకు. అంతా నిన్ను గౌరవిస్తారు. మనుషుల మధ్య

ఒక రాత్రివేళ దొంగ ఒకడు సిద్ధుడి దగ్గర వున్న డబ్బు దొంగిలించి పారిపోతూండడం గమనించిన నందుడు, వాణ్ణి పట్టుకున్నాడు. సత్రంలో వున్న జనమంతా కలిసి దొంగను చితకదన్నాలన్నారు. సిద్ధుడు వాళ్ళను వారించి, "ముందుగా వీడు దొంగతనం ఎందుకు చేశాడో కనుక్కుందాం," అన్నాడు.

అప్పుడు దొంగ తన కష్టాలన్నీ చెప్పుకున్నాడు. అక్కడ వున్న వాళ్ళందరూ అది విని జాలిపడడమే గాక, వాళ్ళల్లో కొందరు కన్నీళ్ళు కూడా పెట్టుకున్నారు.

ఇదిచూసి సిద్ధుడు నవ్వి, "కన్నీళ్ళు కడుపు నింపవు. వీడికి కావలసింది జాలి కాదు, డబ్బు. మన మధ్య ఒక మనిషి దొంగగా

తయారయ్యాడంటే, ఆ తప్పు మనదే!" అని చెప్పాడు.

అక్కడున్న వాళ్ళందరూ సిద్ధుడి మాటలకు తల ఊపి, అప్పటికప్పుడు దానం చేశారు. నూరు వరహాలు పోగయ్యాయి. దొంగ ఆ డబ్బు తీసుకుని సంతోషంగా వెళ్ళబోతూంటే సిద్ధుడు ఆపి, "నువ్వు దొంగగా ఈ సత్రంలో అడుగుపెట్టావు. బిచ్చగాడిగా మారి వెళ్ళబోతున్నావు. నీకు మానాభిమానాలంటూ లేవా?" అని అడిగాడు.

"అయితే, నేనేం చేయాలి?" అన్నాడు దొంగ.

"నీ ఊరేదో చెప్పు. నేను వెళ్ళి ఈ డబ్బుతో మీవాళ్ళ అవసరాలు తీర్చుతాను," అన్నాడు సిద్ధుడు.

అప్పుడు దొంగ సిద్ధుడి కాళ్ళమీద పడి, "అయ్యా! నాకు అయినవాళ్ళెవరూ లేరు. ఒంటరిగాణ్ణి. బుద్ధి గడ్డితిని దొంగతనాలకు దిగాను. ఇకమీదట దొంగతనాలు చెయ్యను. ఈ ఊళ్ళో నాకెవ్వరూ పని ఇవ్వరు. ఈ వంద వరహాలతో మరే ఊరేదైనా వెళ్ళి వ్యాపారం ప్రారంభించి నీతిగా జీవిస్తాను," అన్నాడు.

సిద్ధుడు నవ్వి, "ఈ ఊళ్ళో నీకెవ్వరూ పని ఇవ్వకపోతే మాత్రం, నీకు నష్టమేమిటి? నీకు లేని కష్టాలను కల్పించి చెప్పి, మా అందరిచేతా కళ్ళనీళ్ళు పెట్టించావు. అంటే నువ్వు గొప్ప నటుడివి. నువ్వు నాటకాలాడి డబ్బు సంపాదించుకో. దొంగతనం చెడ్డది. నటన గౌరవమైన వృత్తి," అంటూ దొంగ





నుంచి డబ్బు తీసుకుని, అక్కడున్న ఒక పెద్దమనిషికిచ్చాడు.

సిద్ధుడు చెప్పినదానికి దొంగ ఒప్పుకోక తప్పలేదు. సిద్ధుడు, నందుడు అక్కడినుంచి బయల్దేరారు. దారిలో నందుడు, సిద్ధుడి తెలివిని మెచ్చుకున్నాడు. దానికి సిద్ధుడు, "కొందరు అవసరం కోసం దొంగతనాలు చేస్తారు. కొందరు కష్టపడలేక దొంగతనాలు చేస్తారు. మనకు దానగుణముంటే సరిపోదు. ఆ దానం సరిగ్గా ఉపయోగపడేలా చూడడం కూడా మన బాధ్యత," అన్నాడు.

"మీవంటి మహాజ్ఞానులు ఊరూరా వుంటే ఎంతో బావుంటుంది. ఈ ప్రపంచంలో నేరాలన్నవి వుండవు," అన్నాడు నందుడు.

"జ్ఞానం అందరికీ అంటదు. అలాగే జ్ఞాని అందరికీ ఉపయోగపడడు. ఈ ప్రపంచానికి అవసరమైనది జ్ఞానం కాదు, డబ్బు. ఆ డబ్బు కోసమే దొంగ దొంగతనం చేయబోయాడు. నువ్వు చావాలనుకున్నావు. పట్నం చేరాక నిన్ను నా యజమాని వద్దకు తీసుకు వెళతాను. డబ్బు, జ్ఞానం రెండూ వుండడం వల్ల, ఆయన నావంటి జ్ఞానులు చాలామందిని పోషిస్తున్నాడు. నీకూ ఏదో దారి చూపిస్తాడు," అన్నాడు సిద్ధుడు.

పట్నం చేరేలోగా నందుడు, సిద్ధుడి ప్రతిభను మరికొన్ని విషయాల్లో కూడా చూశాడు. ఒకచోట రోగి ఒకడు చావుబతుకుల్లో వుంటే, బంధువులంతా చుట్టూ చేరి దైవప్రార్థనలు చేస్తున్నారు. సిద్ధుడు వాళ్ళను కోప్పడి, "ఈ రోగి ముఖంలో మృత్యుకళ లేదు. ముందు వైద్యుణ్ణి పిలిపించండి," అన్నాడు.

వైద్యుడు వచ్చాక సిద్ధుడు, రోగి ముఖ కవళికలను బట్టి తనకు తోచింది చెప్పాడు. వైద్యుడాయన పాదాలు స్పృశించి, "వైద్యశాస్త్రం క్షుణ్ణంగా చదువుకున్నా, నాకీ విషయం స్ఫురించనే లేదు. తమరు అవతారపురుషులయి వుండాలి. ఇక ఈ రోగి ప్రాణాలు నిలబెట్టడం నాకు చిటికెల మీద పని," అన్నాడు.

రోగి బంధువులు సిద్ధుడికి డబ్బిస్తామన్నారు. ఆయన నవ్వి, "నాకు తోచింది నేను చెప్పాను. మీకు ఉపయోగపడినందుకు చాలా సంతోషం. నా తెలివి భగవంతుడిచ్చిన గాలి,

నీరులా ఉచితంగా అందరికీ ఉపయోగ పడాలని నా కోరిక," అని అక్కణ్ణించి కదిలాడు.

ఇంకొకచోట సిద్ధుడు, భాగ్యవంతుడొకడికి వజ్రాల ఎన్నికలో సాయపడ్డాడు. ప్రతిఫలం తీసుకోలేదు. చివరకు ఇద్దరూ పట్నం చేరుకున్నారు. సిద్ధుడు, నందుడికి తన ఇంట ఆశ్రయం ఇచ్చాడు.

మర్నాడు నందుణ్ణి వెంటబెట్టుకుని సిద్ధుడు తన యజమాని వద్దకు వెళ్ళాడు. ఆ యజమాని పట్టువస్త్రాలు ధరించి వున్నాడు. మెడలో రత్నాలహారాలు వేసుకున్నాడు. అత్తరు పరిమళంతో ఘుమఘుమలాడిపోతున్నాడు.

ఆయన సిద్ధుణ్ణి చూడగానే ధుమధుమలాడిపోతూ, "తమరు రెండు రోజుల క్రితం రావలసింది. ఈ రోజు వచ్చారు. ఈలోగా తమరు లేక నాకు లక్షల్లో నష్టం వచ్చింది. ఒక పరదేశి అవసరానికి తన దగ్గరున్న వజ్రాల హారాన్ని తెగనమ్ముకుంటానన్నాడు. ఆ వజ్రాలు అసలువో నకలువో తెలీదు. తమరు తప్ప మరొక నిపుణుడు లేక నేను వదులుకుంటే, నా పోటీదారవి కొనుక్కున్నాడు. మిమ్మల్ని నమ్మి సెలవిచ్చి ఊరు పంపినందుకు, నాకు బాగా పరాభవమయింది. అన్నమాట నిలబెట్టుకోవాలని తెలియని వాళ్ళకు ఏళ్ళొచ్చి ఏం లాభం?" అంటూ దుర్భాష లాడాడు.

అనుకోకుండా ఆలస్యం జరిగిందనీ, మరొకసారి అలా జరగనివ్వననీ సిద్ధుడు మరీమరీ చెప్పి క్షమాపణ అడిగాక, యజమాని శాంతించాడు.





ఆ సమయంలో కొందరు పనివాళ్ళు ఒకణ్ణి అక్కడికి తీసుకువచ్చి, "అయ్యా! వీడు నమ్మకంగా వున్నట్లు నటిస్తూ దొంగ తనం చేయబోయాడు," అని ఫిర్యాదు చేశారు.

యజమాని వెంటనే, "వీడికి ముతక బట్టలు కట్టండి. మెడలో ఒక బిళ్ళ తగిలించి దొంగ అని రాయండి. బండరాళ్ళు కొట్టే లాంటి కష్టమైన పనులు చేయించండి. సాయంత్రాలు గాడిద మీద కూర్చోబెట్టి ఊరంతా తిప్పండి. అలా ఆరు వారాలపాటు చేస్తే, జీవితంలో తిరిగి దొంగతనం జోలికి పోడు," అన్నాడు.

సిద్ధుడు, యజమాని నిర్ణయం విని మౌనంగా వూరుకున్నాడు. ఇది చూసి నందుడు, సత్రంలో దొంగకు తీర్పు చెప్పింది ఈయనేనా అని ఆశ్చర్యపోయాడు.

ఆ తర్వాత ఇంకొక పనివాడు యజమాని దగ్గరకు వచ్చి, తన కొడుక్కు జబ్బు చేసిం దనీ వైద్యానికి డబ్బు కావాలనీ అడిగాడు. యజమాని వెంటనే, "ఈ ఊళ్ళో వెంకటేశ్వ రుడి గుడి ఎందుకు కట్టించాననుకున్నావు? నీలాంటి వాళ్ళకు సాయపడాలనే! ఉన్నవా ళ్ళకు దేవుడు సాయం చేయడు. అందువల్ల వైద్యుడు కావాలి. పేదవాళ్ళు అదృష్టవంతులు. వాళ్ళకు దేవుడే వైద్యుడు. వెళ్ళు, గుడికి వెళ్ళి మొక్కుకో!" అన్నాడు సిద్ధుడి వంక చూస్తూ.

సిద్ధుడు ఈసారి కూడా మౌనంగా వుండ డంచూసి, నందుడు మరింత ఆశ్చర్యపోయాడు.

ఆతర్వాత యజమాని, సిద్ధుడికి తన శరీర పరిస్థితి చెప్పుకున్నాడు. సిద్ధుడాయనకు కొన్ని ఆహార నియమాలు చెప్పాడు. కొద్దిసేప టికి ఒక రత్నాల వ్యాపారి వస్తే, సిద్ధుడు, యజమానికి రత్నాల ఎన్నికలో సాయపడ్డాడు.

అంతా అయ్యాక సిద్ధుడాయనకు నందుణ్ణి చూపిస్తూ, "ఇతడికి మీ కొలువులో తగిన ఉద్యోగం ఇప్పించాలి. కాదనడానికి వీల్లేదు," అన్నాడు. "తమరు చెప్పాక తప్పుతుందా?" అంటూ యజమాని, నందుణ్ణి కొన్ని ప్రశ్నలడిగి నెలకు వెయ్యివరహాల జీతంమీద వ్యాపారపు లెక్కలు పర్యవేక్షించే పని ఇచ్చాడు.

తర్వాత ఇద్దరూ ఇంటికి బయలుదేరారు. దారిలో నందుడు, సిద్ధుడికి తన కృతజ్ఞతలు

తెలుపుకుని, "తమ జ్ఞానాన్ని, తమ యజమాని ఉపయోగించుకున్నట్టు లేదే?" అన్నాడు.

"నా జ్ఞానంతోనే ఆయన లక్షలార్జిస్తు న్నాడు," అన్నాడు సిద్ధుడు.

"నేననేది వజ్రాల విషయంలోనూ, రత్నాల విషయంలోనూ కాదు. మిగతా ఏ విషయం లోనూ ఆయన మిమ్మల్ని సలహా అడగలేదు. ఆయన తప్పునిర్ణయాలు చేస్తూంటే మీరు మౌనంగా వూరుకున్నారు!" అన్నాడు నందుడు.

"నేను తప్పని చెప్పినా, ఆయన తన నిర్ణయాన్ని మార్చుకోకపోగా ఆగ్రహిస్తాడు. ఆయన్నలా సంతోషపెట్టాను కాబట్టే, నేను చెప్పగానే నా మాట గౌరవించి నీకు ఉద్యోగం ఇచ్చాడు. అర్థమయిందా?" అన్నాడు సిద్ధుడు.

"కానీ ముందుగా ఆయన మిమ్మల్ని నానా దుర్భాషలూ ఆడాడు. అవి వింటూ ఆయన దగ్గరే పనిచేయడానికి తమకు ఆత్మగౌరవం అడ్డు రాదా?" అని అడిగాడు నందుడు.

దానికి సిద్ధుడు నవ్వి, "అజ్ఞానికి డబ్బే ముఖ్యం. డబ్బు కోసం ఏమైనా చెయ్యవచ్చు. నేను అజ్ఞానిని కాక జ్ఞానినే అయితే, ఆత్మ గౌరవం అన్న పదానికి అర్థమే వుండదు. ఆత్మస్వయంప్రకాశం, నిత్యనూతనం. దానికే మలినమూ అంటదు. తిట్టేటప్పుడు యజ మాని నాకు పసివాడులా తోచి నవ్వొస్తుంది. ఎన్ని అన్నా నన్నాయన వదులుకోలేడు. నావల్ల ఆయనకు చాలా ప్రయోజనాలు వున్నాయి. నేనాయనను వదులుకుందామంటే కుదరదు. నా తెలివినాయన సొమ్ము చేసుకోగలడు కానీ, ఆ పని నాచేత మాత్రం కాదు. ఆయన వల్లనే నా జీవితం సుఖంగా వుంది. ఇక జ్ఞానం సంగతంటావా? జ్ఞానవంతుడైన వాడికి అడగనివారికీ, అవసరం లేదనుకున్న వారికీ సలహాలివ్వబోవడం నిష్ప్రయోజనమని తెలుసు!" అన్నాడు.

నందుడి సందేహాలన్నీ తొలగిపోయాయి. వాడు సిద్ధుడి అడుగుజాడలలో నడుస్తూ, తన జ్ఞానాన్ని అవసరమైన చోటనే ఉపయో గిస్తూ, అనువుకానిచోట అధికుడిననకుండా జీవితం గడుపుతూ, పదిమందిలో మంచి పేరు తెచ్చుకున్నాడు.



# చందమామ కబుర్లు

## మెరుగులు దిద్దుకుంటూన్న 'ఓల్డ్‌లేడీ'

ప్యారిస్ నగరంలో ఈఫిల్‌టవర్‌ను నిర్మించి 106 సంవత్సరాలు పూర్తి అవుతున్నది. దీనిని అక్కడి ప్రజలు ఆప్యాయంగా 'ఓల్డ్‌లేడీ' అని చెప్పుకుంటారు. దీనికిప్పుడు రంగు వేసే పని ఉధృతంగా సాగుతున్నది. ఫ్రెంచి విప్లవం జరిగి వంద సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా ఈ టవర్‌ను 1887వ సం॥లో గస్టేవ్ అలెగ్జాండ్రి ఈఫిల్ నిర్మించడం ప్రారంభించాడు. అప్పటి నుంచి ఏడెనిమిది సంవత్సరాలకొకసారి రంగులు వేయిస్తున్నారు. దీనికి రంగులు వేయడం ఇది 17వ సారి. దీని ఎత్తు 1,050 అడుగులు (320 మీ). ఎత్తయిన ఈ టవర్ మీదికి ఎక్కి పనిచేయడానికి ముందుకు వచ్చిన వారికి గస్టేవ్ ఈఫిల్ ఎక్కువ జీతాలిచ్చి ప్రోత్సహించాడని అంటారు. ఇప్పుడు పనిచేస్తున్న వాళ్ళకు కూడా మామూలు జీతాల కన్నా ఎక్కువ ఇస్తున్నారు. 15-20 నెలలలోగా రంగులు వేసే పని పూర్తికావచ్చుననుకుంటున్నారు. 50 టన్నుల పెయింట్ ఉపయోగిస్తారు. సీన్ నదీ తీరంలో ఉన్న ఈ అందమైన టవర్ యేటా 6,000,000 పర్యాటకులను ఆకర్షిస్తున్నది. ప్యారీస్ నగరానికి ప్రధాన చిహ్నంగా ఉంటున్న ఈ టవర్‌ను 1889వ సం॥లో పర్యాటకుల కోసం తెరిచారు.

## ప్రథమ మహిళా స్పేస్ పైలట్

అమెరికా వ్యోమనౌక 'డిస్కవరీ' ఫిబ్రవరి మూడవ తేదీ అంతరిక్షంలోకి వెళ్ళి వారం రోజులు పయనంచేసి విజయవంతంగా భూమికి తిరిగి వచ్చింది. దీనిని నడిపినది ఒక మహిళ. ఆమె పేరు ఎలీన్ కాలిన్స్. ప్రథమ మహిళా స్పేస్ పైలట్ అయిన ఎలీన్ వయసు 38 సంవత్సరాలు. ఎలీన్‌కు బాల్యం నుంచే అంతరిక్ష ప్రయాణం చేయాలనే కోరిక ఉండేది. అది ఇప్పుడు నెరవేరింది. ఆమె నడిపిన 'డిస్కవరీ' వ్యోమనౌక, అంతరిక్ష కక్ష్యలో పరిభ్రమిస్తున్న రష్యన్ వ్యోమ ప్రయోగశాల 'మీర్'ను సమీపించడం విశేషంగా భావిస్తున్నారు. నాలుగు నెలలలోగా 'డిస్కవరీ'ని మళ్ళీ అంతరిక్షానికి పంపి 'మీర్'తో కలపాలని శాస్త్రవేత్తలు పథకం వేస్తున్నారు!

## 'తృష్ణ'లో నావికురాలు

సెకండ్ లెఫ్టినెంట్ దీపా నీతా దాస్‌ను మరొక సాహసవనితగా పేర్కొనవచ్చు. 1994వ సం॥ మార్చ్ నెలలో ఆమె భారత సైన్యంలో చేరింది. ఏడు నెలల తర్వాత బొంబాయి నుంచి సింగపూర్‌కు వెళ్ళి తిరిగివచ్చిన 'తృష్ణ' అనే పడవలో దీపా నీతా దాస్ నావికురాలుగా వెళ్ళి వచ్చింది. ఆ ఓడను నడిపిన 12 మంది నావికులలో దీప మాత్రమే స్త్రీ. గత ఫిబ్రవరి 1వ తేదీ బొంబాయి నుంచి బయలు దేరిన 'తృష్ణ', మాల్‌దీవులు, శ్రీలంక, అండమాన్స్, థాయ్‌లాండ్, ఇండొనేషియా, మలేసియా, సింగపూర్‌ల గుండా 11,000 కి.మీ. దూరం ప్రయాణం చేసి విజయవంతంగా బొంబాయికి తిరిగి వచ్చింది!






పాండవులు తమ తల్లితో సహా వారణావతానికి పోవటానికి సిద్ధమయ్యారు. వారి కోసం గుర్రాలు పూన్చిన రథాలు సిద్ధంగా ఉన్నాయి. వాళ్ళు భీష్ముడికీ, ధృతరాష్ట్రుడికీ, విదురుడికీ, ద్రోణకృపులకూ, బాహ్లిక సోమదత్తుల వంటి ఇతర పెద్దలకూ గౌరవంగా నమస్కారాలు చేసి, వారి ఆశీర్వాదాలుపొంది, అక్కడి నుంచి దీనవదనాలతో బయలుదేరారు.

అప్పుడు కొందరు సాహసికులైన బ్రాహ్మణులు పాండవుల వెంబడి పోతూ, రాజభయం ఏ మాత్రమూ లేక, "అయ్యో, ఈ గుడ్డిరాజు ఎంత పాపాత్ముడు! పాండవులు పాపం, ఎవరికేమి అపకారం చేశారు? వాళ్ళ తండ్రి పాలించిన రాజ్యం వాళ్ళది కాదా? అయినా ఇలా వెళ్ళిపోవటానికి ధర్మరాజు మాత్రం ఎలా ఒప్పుకున్నాడు? ఇంత జరిగాక ఈ పాపిష్టిరాజ్యంలో మనం ఎందుకుండాలి? ధర్మరాజు ఎక్కడికి పోతే మనమూ అక్కడికే పోదాం," అని గట్టిగా మాట్లాడుకున్నారు.

ఈ మాటలు విని ధర్మరాజు వాళ్ళతో, "అయ్యా, ధృతరాష్ట్రుడు మాకు పెద్దదిక్కు. ఆయన ఎక్కడికి పొమ్మంటే మేము అక్కడికి పోతాము. అది మా కర్తవ్యం. మీరు మా మేలు కోరేవారు గనక మాకు ఎదురుగా వచ్చి దీవించి, దయచేసి మీ మీ ఇళ్ళకు తిరిగివెళ్ళండి," అని చెప్పి, వారిని పంపేశాడు.

సాగనంపటానికి వచ్చిన వాళ్ళు కూడా వెనక్కు తగ్గినాక, విదురుడు ధర్మరాజు వెంట కొంత దూరం వెళ్ళి, వారి కోసం లక్క

10. లక్కఇంటి దహనం



ఇల్లు నిర్మాణమై సిద్ధంగా ఉన్నదనీ శత్రువుల మనిషి ఒకడు ఆ ఇంట వారి వెంట ఉంటాడనీ,వారిని ఆ లక్కఇంటితోపాటు కాల్చేసే ప్రయత్నం జరుగుతుందనీ ఏమరుపాటు ఏ మాత్రమూ లేక వారు ఆ ఇంటి నుంచి బయటపడి ప్రాణాలు దక్కించుకోవాలనీ, తన మనిషి ఒకడులక్కఇంటినుంచి అరణ్యం లోకి సొరంగం తవ్వి ఉంచుతాడనీ, పాండవులు ప్రాణాలు ఉపాయంగా దక్కించుకుని అరణ్యం చేరుకున్నాక నక్షత్రాలను బట్టి దిక్కు తెలుసుకుంటూ ఎటైనా వెళ్ళిపోవాలనీ, లక్క ఇంట ప్రవేశించటం మాత్రం మానవద్దనీ రహస్యంగా చెప్పి,తానుకూడా వెనక్కు మళ్ళాడు.

తరవాతకుంతీదేవిధర్మరాజుతో,"నాయనా, విదురుడు నీతో ఏదో రహస్యంగా చెప్పాడు. దాన్ని మేము కూడా వినవచ్చునా?" అన్నది.

ధర్మరాజు తల్లికీ, తమ్ములకూ, "అగ్ని వగైరా భయాలు కలిగితే నేర్పుగా తప్పించుకోమనీ, నేర్పుగా జీవిస్తూ, రాజ్యం సాధించుకోమనీ విదురుడు మనలను హెచ్చరించాడు. నేను సరేనన్నాను," అని చెప్పాడు.

ఫాల్గుణ శుద్ధ అష్టమీ రోహిణీ నక్షత్రం నాడు పాండవులు వారణావతం చేరారు. వారి రాక ముందుగానే తెలిసి వందిమాగధులూ, బ్రాహ్మణులూ మేళతాళాలతో ఎదురు వచ్చారు. వారికోసం ఊరంతా తోరణాలతోనూ, ముగ్గులతోనూ, పుష్పమాలలతోనూ ఎంతో అందంగా అలంకరించారు.

పాండవులు పురప్రవేశం చేసి, అక్కడి బ్రాహ్మణ, వైశ్య, శూద్ర గృహాలకు వెళ్ళి, అందరికీ బహుమతులిచ్చారు.తరవాత పురోచనుడు వారిని వారి కోసం ఏర్పాటుచేసిన ఇంటికి తీసుకుపోయి, అక్కడవారికి భోజనం కూడా తానే ఏర్పాటు చేశాడు. అక్కడవారు పదిరోజులున్న అనంతరం పురోచనుడు ధర్మరాజుతో, "అయ్యా,మీకోసంకొత్తగా కట్టించిన ఈ ఇంట్లో మీరు ప్రవేశించండి," అని ఆ ఇంటి గొప్పతనమంతా వివరించిచెప్పాడు.

ఆ ఇంటి రహస్యం అదివరకే తెలుసుకుని ఉన్న ధర్మరాజు పురోచనుడితో ఆ ఇంటి అందచందాలుమెచ్చుకుంటున్నట్టుగామాట్లాడి,

తల్లితోనూ, తమ్ములతోనూ ఆ ఇంట ప్రవేశించాడు.

తరవాత ధర్మరాజు భీముడితో రహస్యంగా విదురుడు చెప్పినదంతా చెప్పి, "భీమసేనా, ఈ ఇంటి సువాసన చూడు. అంటిస్తే ఇది క్షణంలో అంటుకుంటుంది. మనని ఈ ఇంట దహనం చెయ్యటానికి ఏర్పాటయినవాడే ఈ పురోచనుడు. అందుచేత మనం ఇక్కడ ఎంతో జాగ్రత్తగా ఉండాలి," అన్నాడు.

ఆ మాట విని భీముడు, "అయితే, మనం ఈ ఇంట్లో ఉండనే వద్దు. మొదట ఉన్న బసకే పోదాం," అన్నాడు.

"అది పెద్ద పొరపాటు. మనం ఈ ఇంట్లో కాలిపోయే అవకాశం లేకపోతే ఈ పురోచనుడు మనని మరొకవిధంగా చంపే ప్రయత్నం చేస్తాడు. మనం ఈ ఇంటితోపాటు కాలిపోయామనే భ్రమ కలిగించి పారిపోవటం ఒకటే ఉపాయం. పారిపోవటానికి మనకు అరణ్య మార్గాలు బాగా తెలియటంఅవసరం. కాబట్టి వేట నెపంతో రోజూ అరణ్యమార్గాలన్నీ అన్వేషింతాం," అన్నాడు ధర్మరాజు.

ఆప్రకారమే పాండవులు పగలంతా వేటాడుతూ అరణ్యంలో తిరిగి, రాత్రి తెల్లవార్లూ జాగర్త మీద ఉంటూ వచ్చారు.

ఈ లోపుగా హస్తినాపురంలో విదురుడు సొరంగాలు తవ్వటంలో నిపుణుడైనవాణ్ణి ఒకణ్ణి రహస్యంగా పిలిపించి, వాడికి చెప్పవలసినదంతా వివరంగా చెప్పి, వాడు తనమనిషి



అని తెలియగలందులకు కొన్ని సంకేతాలు చెప్పి వారణావతంలో ఉన్న పాండవుల వద్దకు పంపాడు.

వాడు పాండవులను చేరుకుని, "దుష్ట చతుష్టయం నియోగించి పంపిన ఈ దుర్మార్గుడు పురోచనుడు, వచ్చే కృష్ణచతుర్దశి రాత్రి ఈ లక్క ఇంటికి నిప్పుపెట్టబోతున్నాడు. ఆ రాత్రి మీరు తప్పించుకు పోవటానికి ఈ ఇంటి మధ్య నుంచి ఊరి బయటి వనంలోకి సొరంగం తవ్వమనీ, దాని ద్వారా బయటపడి మీరు ఎటైనా వెళ్ళిపోవలసిందనీ విదురుడు హెచ్చరించాడు. నేను సొరంగం తవ్వటానికే విదురుడు పంపగా హస్తినాపురం నుంచి వచ్చాను," అన్నాడు.

ఆ మనిషి ఇంటి మధ్య నుంచి ఒక బిలం తవ్వి, దాని ద్వారాన్ని ఎంతో నేర్పుగా కప్పి పెట్టి పాండవులకు చూపాడు.

పాండవులు తామున్న ఇంటిని గురించి గాని, దానిని తగలబెట్టటానికి నియోగించ బడిన పురోచనుణ్ణి గురించిగాని తమకు ఏ మాత్రమూ అనుమానం లేనట్టే ప్రవర్తించి, పురోచనుడికి నమ్మకం కలిగించారు.

కృష్ణచతుర్దశి వచ్చింది. ఆ రోజు కుంతీ దేవి పురంలోని బ్రాహ్మణులకూ, బ్రాహ్మణ స్త్రీలకూ అన్నసంతర్పణ చేసింది. పురోచనుడు ఒక ఆటవిక స్త్రీనీ, ఆమె పిల్లలనూ పాండవులకు సేవ చెయ్యటానికి నియోగించాడు. ఆ ఆటవిక కుటుంబంవాళ్ళువన్యఫలాలు తెచ్చే వాళ్ళు, ప్రతి పనిలోనూ కుంతీదేవికి సాయపడే వాళ్ళు. ఆ రోజు ఉత్సవం గనక ఆ స్త్రీతోబాటు, ఆమె కొడుకులుఅయిదుగురూ జాస్తిగా కల్లు తాగి, ఆ రాత్రికి ఆ ఇంటనే పడుకున్నారు.

అర్ధరాత్రివేళ భీముడు వెళ్ళి, పురోచనుడు పడుకునే గది వాకిలికి నిప్పు అంటించి, తల్లినీ, అన్నలనూ సొరంగం గుండా పంపేసి, ఇంటి నాలుగు మూలలా నిప్పు పెట్టి, తాను కూడా బిలం ప్రవేశించి, సొరంగం తవ్వినవాడి దగ్గిరికి చేరి తమ క్షేమం తెలిపాడు. అందరూ సొరంగ మార్గాన అరణ్యం చేరారు.

వారు అరణ్య మార్గాన పోయేటప్పుడు కుంతి నడవలేకపోయింది. ఆమెను భీముడు తన భుజాల మీది కెత్తుకున్నాడు. అతను మిగిలిన వాళ్ళను కూడా పట్టుకుని నడిపించ వలిసి వచ్చింది. ఈ విధంగా వాళ్ళు కటిక



చీకటిలో పడి అరణ్య మార్గాన వెళ్ళి గంగా నదిని చేరుకున్నారు.

అక్కడ వారిని గంగ దాటించటానికి ఒక పడవ సిద్ధంగా ఉన్నది. ఆ పడవను కూడా విదురుడే ఏర్పాటు చేశాడు.

పడవ వాడు చెప్పిన మాటలను బట్టి వాడు విదురుడి మనిషేనని రూఢి అయ్యాక పాండవులు తల్లితో సహా వాడి పడవ ఎక్కి గంగ దాటారు. పడవవాడు పాండవులు చెప్పిన సంకేతపు మాటలు గ్రహించి, వాటిని విదురుడికి చేర్చటానికి హస్తినాపురానికి పడవనడుపుకుంటూ వెళ్ళిపోయాడు.

ఇంకా రాత్రి కొంత మిగిలి ఉన్నది. పాండవులు నక్షత్రాలనుబట్టి దిక్కులు తెలుసుకుని, దక్షిణంగా నడవ నారంభించారు. కొంత దూరం వెళ్ళాక భీముడు తప్ప మిగిలినవాళ్ళు ఒక్క అడుగైనా నడవలేకపోయారు. రాత్రంతా నిద్రలేదు, దారీ తెన్నూలేని అరణ్య మార్గాన నడక! అందరూ నడవలేక చతికిలబడటం చూసి, భీముడు అందరినీ తన భుజాన ఒక్కసారే ఎత్తుకుని కొంత దూరం నడిచి, ఒక చోట పెద్ద బండ మీద దించి, పక్కన కూర్చున్నాడు. కొంచెం సేపయ్యాక కుంతిభీముడితో, "నాయనా, దాహంతో ప్రాణం పోయేటట్టున్నది," అన్నది.

భీముడు మళ్ళీ అందరినీ ఎత్తుకునిపోయి ఒక మర్రిచెట్టు కింద దించి, "మీరందరూ ఇక్కడే పడుకుని ఉండండి. నేను వెళ్లి మీ అందరికీ నీరు తెస్తాను," అని అక్కడి నుంచి బయలుదేరాడు.



కొంత దూరం పోగా అతనికి నీటి పక్షుల కలకలం వినిపించింది. ఆ దిక్కుగా పోగా ఒక కొలను కనిపించింది. భీముడందులో స్నానం చేసి, తల్లికీ మిగిలినవారికీ కావలసిన నీరు తీసుకుని తిరిగి వచ్చేసరికి, అందరూ గాఢనిద్రలో ఉండటం కనిపించింది.

"ఇంత ఆపదలో కూడా వీళ్ళు ఇంత నిద్ర పోతున్నారంటే ఎంతగా అలసిపోయారో గదా!" అనుకుని భీముడు, వాళ్ళను లేపటానికి మనసొప్పక, వారు ఎప్పుడు లేస్తారా, నీరిద్దామని వేచి కూర్చున్నాడు.

అక్కడ వారణావతంలో పాండవులుండిన ఇల్లు కాలిన సంగతి ఊరు ఊరంతా తెలిసింది. జనం పోగయ్యారు. ఇంకా మంటలు అంతో ఇంతో మండుతూనే ఉన్నాయి. సొరంగం తవ్వినవాడు ఆ మంటలను ఆర్పేవాడిలాగా బూడిదను అటూ ఇటూ తోస్తూ బిలద్వారాన్ని అతి నేర్పుగా కప్పేశాడు. పురోచనుడి శవమూ, ఆటవిక స్త్రీ శవమూ, ఆమె అయిదుగురు కొడుకుల శవాలూ కాలి గుర్తించరాకుండా ఉన్నాయి. కుంతితో సహా పాండవులూ, వారి వెంట ఉన్న పురోచనుడూ ఆ లక్క ఇంట కాలిపోయారని జనం అనుకున్నారు.

ఈ వార్త హస్తినాపురం చేరింది. కుంతీ పాండవులు ఇంటితోసహా కాలిపోయారని వినగానే ధృతరాష్ట్రుడు గుండెలవిసి మూర్ఛపోయాడు.



విదురుడు ఎవరూ అనుమానించకుండా నలుగురితోబాటు తానుకూడా దొంగ కన్నీరు కార్చాడు.

అక్కడ పాండవులు అలిసి నిద్రపోతున్న వనంలో హిడింబుడనే రాక్షసుడుండేవాడు. వాడిది నల్లగా, అతి బలిష్ఠంగా ఉండే దేహం, పసుపు పచ్చ కళ్ళు, భయంకరమైన ఆకారం, వేల్లాడే పెద్ద కడుపు, మొనతేలిన ఎర్రని మీసాలు. వాడు నరభక్షకుడు. ఆకలి దహించుకుపోతూ హిడింబుడు ఆహారం కోసం అరణ్యమంతా తిరుగుతూ, ఒక మద్దిచెట్టెక్కాడు. దాని మీద కూర్చుని వాడు జుట్టు విదిలించుకుంటూ, బుర్ర గోక్కుంటూ, పెద్ద పెట్టున ఆవులిస్తూ, చుట్టూ చూస్తుండగా

వాడికి దూరాన మఱ్ఱిచెట్టు కింద పడుకుని కొందరు మనుషులు కనిపించారు.

హిడింబుడు తన చెల్లెలైన హిడింబను పిలిచి, "చెల్లీ,చాలా కాలానికి మనిషి మాంసం దొరికింది.నువ్వు తక్షణమే వెళ్లి,ఆమఱ్ఱి చెట్టు కింద ఎంతమంది నిద్రపోతూ ఉంటే అంత మందినీ చంపితీసుకురా.మనం కడుపునిండా తిని సంతోషంగా నృత్యం చేద్దాం," అన్నాడు.

హిడింబ అలాగేనని బయలుదేరి, పాండ వులున్న చోటికి వచ్చి, నిద్రపోతున్న కుంతినీ, ధర్మరాజునూ, అర్జునుణ్ణీ,నకుల సహదేవు లనూ, వారికి కాపలా కాస్తున్న భీముణ్ణీ చూసింది. హిడింబ కంటికి భీముడు నాజూ కుగానూ, నవమన్మథుడుగానూ కనిపించాడు. ఆమెకు అతనిపై ఆశ పుట్టుకొచ్చింది. ఆ ఆశ కారణంగా ఆమెకు అన్న చాలా దూరం గా ఉన్నట్టు తోచాడు. ఆ మనుషులను చంపేకన్న బతికి ఉండనిస్తే తాను ఆ నవ మన్మథుడితో ఎంతో కాలం సుఖంగా ఉండ వచ్చునని,తన ఆశను ఎలాగైనా భీముడితో వెలిబుచ్చాలనుకున్నది హిడింబ.

ఆమె అందమైన రూపం ధరించి చక్కని బట్టలు కట్టుకుని సిగ్గుతో కూడిన చిరు నవ్వులను భీముడి మీద ప్రసరింపజేస్తూ, దగ్గరికి వచ్చి, "మహానుభావా, నువ్వెవరు? మీదేదేశం? ఈ నిద్రపోయేవారెవరు? ఇక్కడికి ఎందుకు వచ్చారు? ఎంతో సుకుమారిలాగా ఉన్న ఈ ముసలావిడ ఎవరు? ఈ అర ణ్యంలో నా అన్న హిడింబుడుంటాడనీ, అతను మహాబలుడైన రాక్షసుడనీ, అమిత క్రూరుడనీ మీకు తెలీదా? వీళ్ళు నిశ్చింతగా ఎలా నిద్రపోతున్నారు? మిమ్మల్నందరినీ చంపి ఆహారంగా తెమ్మని ఆజ్ఞాపించి మా అన్న నన్ను ఇక్కడికి పంపాడు. కాని నీ అందం చూస్తుంటే నాలో ఆశ పుట్టుకొచ్చింది. అందువల్ల మిమ్మల్ని చంప బుద్ధి కావటం లేదు. నన్ను పెళ్ళాడి నాకోరిక తీర్చావంటే, మీకు మా అన్న భయం లేకుండా మిమ్మల్ని కామ గమనం ద్వారా సురక్షిత ప్రాంతానికి చేర్చుతాను. అక్కడ మనమిద్దరమూ తక్కిన వారూ సుఖంగా ఉండగలం. నా మాట కాద నకు," అన్నది.



| చందమామ అనుబంధం - 77 | మనదేశపు చెట్లు |
| --- | --- |

## చింతచెట్టు

చింతచెట్టు నీడ, గాలి ఆరోగ్యానికి మంచిది కాదనీ; వేపచెట్టు నీడ, గాలి చాలా మేలు చేస్తుందనీ తెలియజేసే ఒక పాత కథను గత సంచికలో ఇదే శీర్షికలో చదివాము. చింతచెట్టును గురించి మరొక విశేషం కూడా ప్రచారంలో ఉన్నది. కొన్ని వందల సంవత్సరాలకు పూర్వం వంగ దేశానికి చెందిన సుప్రసిద్ధ భక్తి మతబోధకుడు చైతన్య మహాప్రభు బృందావన యాత్రకు వెళ్ళాడు. ఆయన బృందావనం చేరగానే ఒక బ్రహ్మాండమైన చింతచెట్టు కింద కూర్చుని తొలి ఉపన్యాసం ఇచ్చాడు. ఆ ప్రాంతంలోనే శ్రీకృష్ణుడు గోవులు కాచేవాడని భక్తులు విశ్వసిస్తారు. ఆ స్థలానికి 'తైంతుల్ తుల్లా' (చింత చెట్టు కింద) అనే పేరు వచ్చింది. బెంగాలీలో చింతచెట్టును 'తింతిల్' అంటారు. చైతన్య మహాప్రభు అక్కడే గడపడం వల్ల అది చాలా పవిత్రమైనదిగా కూడా ప్రసిద్ధి గాంచింది. ఆ చెట్టు ఇప్పటికీ సజీవంగా ఉందని చెబుతారు. చింతచెట్టు చాలా కాలం బతుకుతుంది.

చింతను హిందీలో ఇమిలీ లేదా అంబ్లీ అనీ, మరాఠీలో ఆమ్లీ అనీ, తమిళంలోనూ మలయాళంలోనూ 'పుళి' అనీ అంటారు.

చింత ఆకులు చిన్నవేగాని దళసరిగా ఉంటాయి. లేతగా ఉన్నప్పుడు పసుపు - ఆకుపచ్చ రంగులో ఉండి క్రమక్రమంగా ముదురు పచ్చ రంగులోకి మారతాయి. పసుపు పచ్చ - లేత ఎరుపు పూలు గుత్తులు గుత్తులుగా పూస్తాయి. కాయలు పొడవుగా వంకర తిరిగి ఉంటాయి. ఒక్కొక్క కాయలో మూడు నుంచి పది విత్తనాల వరకు ఉంటాయి. విత్తనాల చుట్టూ పుల్లటి గుజ్జు ఉంటుంది. కొన్ని పళ్ళు కొద్దిగా తియ్యగానూ ఉంటాయి. కాయ పండిన తరవాత గుజ్జు చుట్టూ పెంకు పొర ఏర్పడుతుంది.



చింత పండును కూరలలోనూ, చారులలోనూఎక్కువగా ఉపయోగిస్తారు. చింత ఆకులకూ, విత్తనాలకూ, గుజ్జుకూ ఔషధ గుణాలు కూడా ఉన్నాయి.

చింత కలప దృఢంగా ఉండడం వల్ల దీనితో బండి చక్రాలు, గూటాలు వంటి వాటిని తయారు చేస్తారు. దీనిని మామూలుగా వంటచెరకుగా ఉపయోగించరు. నీడ కోసం చింతచెట్లను బాటకిరువైపులా నాటుతారు.

మనదేశపు ఋషులు : 1

# వసిష్ఠుడు

భారతీయ నాగరికతకూ, సంస్కృతీ సాహిత్యాలకూ రూపులు దిద్దినవారు సనాతన ఋషులు అన్నది నిర్వివాద అంశం.

తమ జీవితాలను జ్ఞానసముపార్జనకు ధారపోసిన మహనీయులు ఋషులు. అలా కష్టపడి ఆర్జించిన జ్ఞానాన్ని వారు శ్రద్ధాసక్తులతో తమను ఆశ్రయించే అర్హులయిన వారికి అందజేసేవారు. ఆవిధంగా ఋషులు మన తొలి గురువులయ్యారు. వారు రాజకుమారులకే కాకుండా తమను ఆశ్రయించే పేదసాదలకు కూడా జ్ఞానబోధ చేసేవారు. శిష్యులు, ఋషుల ఆశ్రమాలలోనే గురుకులవాసం చేసి విద్య నభ్యసించేవారు.

ప్రాచీన కవులయిన వాల్మీకి వ్యాసాదులు కూడా ఋషులే. మన ప్రాచీన ఋషులలో ముందెన్న తగినవాడు వసిష్ఠుడు. ఆయన ఉన్నతమైన జ్ఞానాన్ని ఆర్జించి, దాని ద్వారా అద్భుత శక్తులను కూడా సాధించాడు. అయినా వాటిని మామూలుగా ఉపయోగించేవాడు కాదు.

ఒకనాడు విశ్వామిత్రుడనే గొప్ప రాజు వేటాడడానికి అడవికి వెళ్ళాడు. కొంతసేపు వేటాడిన తరవాత, అలిసిపోయి, విశ్రాంతి తీసుకోవాలని సమీపంలో ఉన్న వసిష్ఠముని ఆశ్రమానికి వెళ్ళాడు.

మంత్రులు, సేనానులు, అంగరక్షకులు మొదలైన పెద్ద పరివారంతో వచ్చిన విశ్వామిత్రుడికి, వసిష్ఠుడు సాదరంగా స్వాగతం పలికాడు.

విశ్వామిత్రుడు తన పరివారంతో, దాపులనున్న సెలయేటిలో స్నానం చేసి వచ్చే లోపల, వసిష్ఠుడు వారికి పంచభక్ష్య పరమాన్నాలను సిద్ధం చేశాడు. వాటిని చూసి అమితాశ్చర్యం చెందిన విశ్వామిత్రుడు, "ఈ అరణ్యం మధ్య ఇంత త్వరగా ఇన్ని వంటకాలెలా సిద్ధం చేయగలిగావు?" అని వసిష్ఠుణ్ణి అడిగాడు.

"నాదగ్గర కామధేనువు ఉన్నది. అది నేను కోరినది తక్షణమే ప్రసాదిస్తుంది!" అన్నాడు వసిష్ఠుడు.

విశ్వామిత్రుడు భోజనం చేశాడన్న మాటేగాని, ఆయనకు మనసంతా కామధేనువు మీదే లగ్నమయింది. అది తనకు కావాలనుకున్నాడు. బయలుదేరేప్పుడు కామధేనువును తనకు కానుకగా ఇవ్వమని కోరాడు.

వసిష్ఠుడు అందుకు అంగీకరించలేదు. దైవాంశగల కామధేనువును తాను అనుకున్నంత మాత్రాన ఇంకొకరికి దానం చేయలేడు. దాని ఇష్టానుసారమే అది ఆయన ఆశ్రమంలో ఉంటున్నది.

వసిష్ఠుడు తన కోరికను తిరస్కరించడంతో, విశ్వామిత్రుడికి పట్టరాని కోపం వచ్చింది. కామధేనువును బలవంతంగా తీసుకు వెళ్ళడానికి ప్రయత్నించాడు. కాని, కామధేనువు నుంచి వందలాది సైనికులు పుట్టుకువచ్చి విశ్వామిత్రుడి పరివారాన్ని తరిమికొట్టారు.

ఈ సంఘటనతో భౌతిక బలం కన్నా తపోబలం మిన్న అని విశ్వామిత్రుడు గ్రహించాడు. రాజ్యాన్ని త్యజించి బ్రహ్మర్షి కావాలన్న పట్టుదలతో దీక్షగా తపస్సు చేయడం ప్రారంభించాడు.

అయినా, ఆయనలో వసుష్ఠుడి పైన ఏర్పడిన పగ, ద్వేషం చల్లారలేదు. పైగా, వసిష్ఠుడు తనను బ్రహ్మర్షి అని పిలవడానికి నిరాకరించడంతో అవి మరింత పెరిగాయి. ఎటువంటి వారికైనా సరే మానవ నైజాన్ని జయించడం ఎంత కష్టమో ఇది సూచిస్తుంది. మనిషి కొన్ని విషయాలలో ఎంతో వివేకవంతంగానూ, ఉదాత్తంగానూ వ్యవహరించినప్పటికీ మరి కొన్ని విషయాలలో బలహీనంగా, నీచంగా ప్రవర్తిస్తాడనడానికి ఇదొక తార్కాణం.

ఒకనాడు విశ్వామిత్రుడు, వసిష్ఠుణ్ణి చంపాలన్న దుర్బుద్ధితో, రహస్యంగా అతడి కుటీరాన్ని సమీపించినప్పుడు, వసిష్ఠుడూ, ఆయన భార్యా మాట్లాడుకోవడం విని అక్కడే ఆగిపోయాడు.

"మీరు విశ్వామిత్రుణ్ణి బ్రహ్మర్షి అని పిలిచారంటే, ఆయన మీమీద ఉన్న పగను మరచి, వేధించడం మానేస్తాడు కదా? మరి మీరు ఎందుకలా పిలవరు?" అని అడిగింది భార్య.

"విశ్వామిత్రుడు కఠినమైన తపస్సుతో ఇప్పటికే చాలా సాధించాడు. కాని బ్రహ్మర్షి కావడానికి మరి కొన్ని మంచి గుణాలను ఆయన పెంచుకోవాలి. ఇప్పుడు నేను ఆయనను బ్రహ్మర్షి అని పిలిచినట్టయితే, ఆ అహంతో ఆయన తన కృషినీ, పట్టుదలనూ వదులుకోవచ్చు. ఆయన మంచి కాంక్షించే నేనలా పిలవడం లేదు," అని వసిష్ఠుడు భార్యకు వివరించాడు.

ఆ మాటలు విన్న విశ్వామిత్రుడిలో గొప్ప మార్పు వచ్చింది. వసిష్ఠుడికి క్షమాపణలు చెప్పుకున్నాడు.

వసిష్ఠుడి భార్య అరుంధతి కూడా గొప్ప తపస్సంపన్నురాలు. భార్యాభర్తలిరువురూ తనువులు చాలించాక, అంతరిక్షంలోని నక్షత్రాలలో లీనమయ్యారు. ఆకాశంలో కనిపించే సప్తఋషి మండలంలోని ఏడు నక్షత్రాలలో ఒక నక్షత్రం పేరు వసిష్ఠుడు. దాని సమీపంలో లీలగా మెరిసే నక్షత్రాన్ని అరుంధతీ నక్షత్రం అని అంటారు!



# మీకు తెలుసా?

1. రష్యాలో రాజులనూ, రాణులనూ ఏమని పిలిచేవారు?
2. మనదేశ చరిత్రలో 1942వ సం॥ అగస్టు 9వ తేదీ ప్రాముఖ్యత ఏమిటి?
3. సూయెజ్ కాలువ ఎప్పుడు తెరవబడింది? అది ఏ రెండు సముద్రాలను కలుపుతుంది?
4. మనదేశంలో మొట్టమొదట ఏ రెండు స్టేషన్ల మధ్య రైల్వేలైను వేయబడింది?
5. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో 'యాక్సిస్' అన్న పేరుతో ఏకమయిన మూడు దేశాలు ఏవి?
6. మనదేశంలో పన్నెండు సంవత్సరాలకు ఒకసారి జరుపుకునే పండుగ ఏది?
7. ప్రపంచంలో కెల్లా చాలా పెద్ద ద్వీపం ఏది?
8. మనదేశం పాల్గొన్న మొట్టమొదటి 'క్రికెట్ టెస్ట్ పోటీ'ల సమయంలో దాని కేప్టెన్ ఎవరు?
9. భూమి మీద అతి శీతల ప్రదేశం ఏది?
10. ఒలింపిక్ క్రీడలలో మనదేశం తరపున పాల్గొని మొట్టమొదట బంగారు పతకం సాధించిన వారెవరు? ఎప్పుడు?
11. 'ఎలక్ట్రిక్ మోటారు'ను రూపొందించిన వారెవరు?
12. 'ఉదయసూర్యుడి భూమి' అని ప్రసిద్ధి గాంచిన దేశం ఏది?
13. డచ్ కాలనీగా ఉన్నప్పుడు న్యూయార్క్ పేరేమిటి?
14. చైనా మొట్టమొదటి చక్రవర్తి ఎవరు?
15. నోబెల్ శాంతి బహుమతిని అందుకున్న అమెరికాకు చెందిన నీగ్రో నాయకుడు ఎవరు?
16. ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన మొట్టమొదటి మహిళ ఎవరు? ఎప్పుడు?

## సమాధానాలు

1. జార్, జారినా.
2. 'క్విట్ ఇండియా' ఉద్యమం ఆరంభం.
3. 1869. ఎర్రసముద్రం - మధ్యధరా సముద్రం
4. బొంబాయి-థానే. 1853లో.
5. జర్మనీ, ఇటలీ, జపాన్.
6. కుంభమేళా.
7. గ్రీన్‌ల్యాండ్.
8. సి.కె. నాయుడు.
9. అంటార్కిటికాలోని వోస్టాక్ స్టేషన్ (87.6° సెల్సియస్)
10. 1900వ సం॥ ప్యారిస్‌లో జరిగిన క్రీడలలో మన దేశం తరపున నార్మన్ ప్రిట్‌కార్డ్ పాల్గొన్నాడు.
11. మైఖేల్ ఫ్యారడే.
12. జపాన్.
13. న్యూ అమ్స్టర్ డామ్.
14. కుబ్లై ఖాన్ (ఛెంఘిజ్ ఖాన్ మనవడు).
15. మార్టిన్ లూథర్ కింగ్ జూ॥
16. జపానుకు చెందిన జుంకో టాబే. 1975 మే 16.



# జ్ఞానం — పాండిత్యం

రంగనాధపురంలో పాండురంగడనే వ్యాపారి వుండేవాడు. ఆయన వ్యాపారం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా నడుస్తున్నది. అయితే ఆయన కొడుకులిద్దరూ పెరిగి పెద్ద వాళ్ళవుతున్నా, ఒక్కడికీ వ్యాపారంపట్ల ఆసక్తి లేదు.

పాండురంగడి పెద్ద కొడుకు శ్రీనాధుడు ఏక సంథాగ్రాహి. ఎంత క్లిష్టమయిన గ్రంథాన్నయినా సరే ఒక్కసారి చదివితే చాలు, వాడికి పూర్తిగా గుర్తుండిపోయేది. గొప్ప పండితుడు కావాలని వాడి కోరిక.

శ్రీనాధుడి తమ్ముడు కమలనాభుడు కూడా విద్యావంతుడు కావాలని కలలుకంటున్నాడు. నిఘంటువు సహాయంతో కావ్యాలలోని పద్యాలను అర్థం చేసుకుని ఆకళింపు చేసుకుంటూ తన జ్ఞానతృష్ణను తీర్చుకుంటున్నాడువాడు.

ఒక రోజున పాండురంగడి ఇంటికి బృహస్పతి అనే గురువు వచ్చాడు. ఆయన నమీపారణ్యంలో గురుకులాశ్రమం నడుపుతున్నాడు. అప్పుడప్పుడు దేశ సంచారం చేసి తనకు శిష్యులు కాతగ్గ వారిని ఎన్నిక చేసుకుంటాడాయన.

పాండురంగడు తన కొడుకుల గురించి ఆయనకు చెప్పుకుని, "నా కుమారులు విద్యావంతులు కావడం నాకూ ఇష్టమే! కానీ నా వ్యాపారానికి వారసులు కావాలికదా! తమరు వాళ్ళిద్దరినీ పరీక్షించి వాళ్ళల్లో ఒక్కడినైనా వ్యాపారం చేయడానికి ఒప్పించండి," అని కోరాడు.

బృహస్పతి శ్రీనాధుణ్ణి పిలిచి, ఏమేమి గ్రంథాలు చధివినదీ అడిగి తెలుసుకుని ఆశ్చర్యపడ్డాడు. అయా గ్రంథాల్లో ఏమూల వున్న విషయాన్నడిగినా వాడు మక్కికి మక్కీగా అప్పజెప్పాడు.

తర్వాత బృహస్పతి కమలనాభుణ్ణి పిలిచి కొన్ని ప్రశ్నలు వేశాడు. వాడు చాలా గ్రంథాలే

శ్రీరామ కమల్



చదివాడు కానీ ఏదీ కూలంకషంగా రాదు. ప్రతి గ్రంథంలోనూ వాడికి నచ్చిన భాగాలు కొన్ని ఆకళింపు చేసుకున్నాడు.

"నువ్వు చాలా పుస్తకాలే చదివావుకానీ ఒక్కటీ పూర్తి చేయలేదు. అందువల్ల నీది మిడిమిడి జ్ఞానం," అన్నాడు బృహస్పతి.

"ఆర్యా! ఆవిషయం నాకు తెలుసు. అయితే మొత్తం పుస్తకాన్ని ఆకళింపు చేసుకునే శక్తి నాకు లేదు. నాకు ఆసక్తి కలిగించే భాగాలను మాత్రం ఎలాగో కష్టపడి అర్థం చేసుకుంటున్నాను," అన్నాడు కమలనాభుడు.

బృహస్పతి వాడితో ఇంకేమీ చెప్పలేదు. ఆయన పాండురంగడితో, "నీ పెద్ద కొడుకు వ్యాపారానికి పనికి వస్తాడు. రెండో వాడు పండితుడవుతాడు. ఇద్దరినీ కొంతకాలం పాటు నా ఆశ్రమానికి తీసుకునివెళ్ళి కొన్నాళ్ళు వుంచుకుని పంపుతాను," అన్నాడు.

పాండురంగడు ఆశ్చర్యంగా, "ఎలాంటి పుస్తకాన్నయినా ఇట్టే కంఠస్థం చేసే పెద్దవాడిని వ్యాపారిని చేస్తానంటున్నారు. మిడిమిడి జ్ఞానమున్న చిన్నవాడిని పండితుణ్ణి చేస్తామంటున్నారు. మీరుఈ విషయమై లోతుగా ఆలోచించినట్లు లేదు," అన్నాడు.

దానికి బృహస్పతి మందహాసం చేసి, "ఆ విషయం నీకు రేపటికల్లా అర్థమవుతుంది. ఈలోగా నేను నీకొక సాయం చేయదలిచాను. నాకు వైద్య శాస్త్రంలో ప్రవేశముంది. మీఇంట్లో ఎవరైనా వింతరకం జబ్బుతో బాధపడుతూంటే చెప్పు. మంచి మందిచ్చి వెళతాను," అన్నాడు.

పాండురంగడు ఇంటిల్లిపాదినీ ఒకచోట సమావేశపరిచి, బృహస్పతి అన్నమాటలు చెప్పాడు. వెంటనే అందరూ తమకున్న జబ్బుల గురించి చెప్పుకున్నారు. వారిలో పాండురంగడి తల్లి జబ్బు వింతగా వున్నది. ఆవిడకు పిల్లిని చూస్తే తలనొప్పి వస్తుంది. పిల్లి వెళ్ళిపోయిన కాసేపటికది మాయమవుతుంది.

ఈ మాటలు విని బృహస్పతి అప్పటి కప్పుడు తాళ పత్రాలపైన ఏదో రాసి పాండు రంగడికిచ్చి, "ఇందులో నీ తల్లి జబ్బుకు చికిత్స వివరాలు రాశాను. రాత్రి పూట ఏకాంతంలో చదివి, ఇందులోని విశేషాలు అర్థం చేసుకో. రేపు మనం కలుసుకున్నప్పుడు

వివరాలు నాకు చెప్పు. అంతవరకూ ఇందు లోని విశేషాల గురించి ఎవరితోనూ మాట్లాడ కూడదు," అన్నాడు.

తర్వాత ఆయన శ్రీనాధుడికీ, కమల నాభుడికీ రెండు తాళపత్ర గ్రంథాలిచ్చి, "వైద్య శాస్త్రానికి సంబంధించిన గ్రంథానికి రెండు ప్రతులు నా దగ్గరుంటే మీకిస్తున్నాను. ఒక్క రాత్రిలో మీరీగ్రంథాన్నెంతగా అర్థం చేసుకోగలరో ప్రయత్నించండి,"అని చెప్పాడు.

ఆరోజు గడిచింది. మర్నాడందరూ సమా వేశమైనప్పుడు, ముందుగా పాండురంగడు, "ఆర్యా! నాకు సంస్కృత భాషరాదు. తమరు తాళపత్రాల మీద ఆ భాషలో రాసిన శ్లోకా లను అర్థం చేసుకోవడం నావల్ల కాలేదు," అన్నాడు.

బృహస్పతి నవ్వి, శ్రీనాధుడి వంక చూశాడు. వాడు గర్వంగా, "మీరిచ్చిన గ్రంథాన్ని పూర్తిగా కంఠస్థం చేశాను.ఎక్కడి శ్లోకాన్నయినా అడ గండి, అప్పజెబుతాను," అన్నాడు.

బృహస్పతి వాడిని పలువిధాల పరీక్షించి, "మొత్తం గ్రంథాన్ని కంఠస్థం చేయగలిగావు. ఒక్క రోజులో ఇది సాధించడం సామాన్యం కాదు. నువ్వు అసాధారణ ప్రజ్ఞావంతుడివి," అని మెచ్చుకుని,కమలనాభుడివంకచూశాడు.

కమలనాభుడు వినయంగా తలవంచు కుని, "ఈ గ్రంథంలో భాష చాలాక్లిష్టంగా వుంది. అందువల్ల నాకిది ఆకళింపు చేసుకో వడం చేతకాలేదు. అయితే ఇందులో ఒక చోట మా బామ్మ జబ్బుకు సంబంధించిన ప్రసక్తి కనబడింది. ఆ కాస్తా, నిఘంటువు



సాయంతో అర్థం చేసుకున్నాను. ఆవిడ జబ్బును పెరటిమొక్కల సాయంతోనే నయం చేయవచ్చు," అని చెప్పాడు.

ఇందుకు బృహస్పతి తలాడించి, "శ్రీనాధుడి జ్ఞాపకశక్తి అద్భుతమైనది. వ్యాపారస్థుడికి జ్ఞాపకశక్తి ఎన్నోవిధాల పనికివస్తుంది. అందుకే నేను శ్రీనాధుడిని నా వద్ద కొన్నాళ్ళుంచుకుని వ్యాపారస్థుడిగా తీర్చి దిద్దాలనుకుంటున్నాను. కమలనాభుడు గొప్ప పండితుడు కాగలడని నా నమ్మకం. వాడిని విద్యావంతుడిగా తీర్చి దిద్దే బాధ్యతకూడా నాదే!" అన్నాడు.

ఈ నిర్ణయం అన్యాయమనీ, తనకు పండితుడు కావాలని వున్నదనీ శ్రీనాధుడు గోల పెట్టాడు. అప్పుడు బృహస్పతి గంభీరంగా, "నా నిర్ణయం సరైనదేనని ఈ పాటికి కనీసం నీతండ్రికైనా చక్కగా తెలిసివుంటుంది. పాండురంగా! నీ అభిప్రాయమేమిటో చెప్పు," అన్నాడు.

పాండురంగడు కొంతసేపు మౌనంగా ఆలోచిస్తూ వూరుకుని, తర్వాత, "శ్రీనాధుడు పుస్తకం వంటివాడు. పుస్తకంలో వున్న విషయాలన్నింటినీ తన జ్ఞాపకశక్తి సాయంతో మెదడులోకి ఎక్కించేయగలడు. కానీ అందువల్ల ప్రయోజనమేమిటి? తను కంఠస్థం చేసిన గ్రంథంలోబామ్మకు వైద్యచికిత్స వున్నదని కూడా వాడికి తెలియలేదు. భాషరాని వాడికి పుస్తకం ఉపయోగపడదనడానికి, నా అనుభవమే ఋజువు. వైద్య చికిత్స ఎలా చేయాలో సంస్కృత భాషలో వుండడంవల్ల, నేను అర్థం చేసుకోలేక పోయాను. పాండిత్యం లేని వాడి జ్ఞానమూ వృథా అని శ్రీనాధుడు ఋజువు చేశాడు. అవసరం మేరకు విషయాన్నర్థం చేసుకున్న కమలనాభుడికే పండితుడు కాగల అర్హతవుంది. ఈ విషయాన్ని అందరికీ అర్థమయ్యేలా చెప్పిన బృహస్పతి గురువర్యులకు మన మందరం కృతజ్ఞులమై వుండాలి," అన్నాడు.

ఆ తర్వాత పాండురంగడి తల్లికి చికిత్స జరిగింది. బృహస్పతి వద్ద శిక్షణ పొందిన శ్రీనాధుడు గొప్పవ్యాపారిగానూ,కమలనాభుడు గొప్ప పండితుడుగానూ క్రమంగా పేరు తెచ్చుకున్నారు.





# చేపల దొంగ

ఒక బెస్తగ్రామంలో బుచ్చయ్యా, లక్ష్మీ అనే దంపతులున్నారు. బుచ్చయ్య తెలివితేటలు లేనివాడు. అందుచేత లక్ష్మి తన తెలివితేటల తోనే సంసారం ఈదుకొచ్చేది. బుచ్చయ్య నలుగురితోనూ కలిసి సముద్రం మీదికి తెప్పల్లో వెళ్ళేవాడు. అందరూ కలిసి పట్టిన చేపల్లో అతని వంతు అతనికిచ్చేవారు. ఆ చేపలు అమ్మగా వచ్చిన డబ్బుతో లక్ష్మి ఇంటి ఖర్చులన్నీ గడిపేది.

ఒకరోజు బుచ్చయ్యకు చేపల కూర తినాలనిపించింది. ఆ రోజు తమ వంతు వచ్చిన చేపలను అమ్మటానికి అతను ఒప్పుకోక, వాటిని కూరవండమని పెళ్ళాం దగ్గిర మారాం చేశాడు.

ఎంత చెప్పినా వినకపోయేసరికి, "సరే అయితే, ఈ చేపలు పట్టుకుపోయి వాసన పోయేటట్టు కడిగి తీసుకురా," అన్నది లక్ష్మి తన మొగుడితో.

బుచ్చయ్యకు పరమానందమయింది. అతను చేపలబుట్ట పట్టుకుని చెరువు కేసి బయలుదేరాడు.

దారిలో వీరయ్య అనేవాడు ఎదురై, "ఏం, బుచ్చయ్యా? ఎక్కడిదాకా?" అని అడిగాడు.

"ఈ చేపలు చెరువులో కడిగి వాసన పోగొట్టి తెమ్మన్నది మా ఇంటిది. ఇవాళ చేపల కూర తింటాం," అన్నాడు బుచ్చయ్య సంతోషంగా.

"చేపల వాసన కడిగితే పోతుందా? వాటిని ఎండ బెట్టాలి. ఇదుగో చూడు! నా దగ్గిర నాలుగు ఎండు చేపలున్నాయి. నాకు నీ పచ్చి చేప లిచ్చి, ఈ ఎండు చేపలు పట్టుకెళ్ళి, కూర వండించుకో!" అన్నాడు వీరయ్య.

అతను తన నెత్తిమీది తట్టలో నుంచి నాలుగు ఎండు చేపలు తీసి బుచ్చయ్యకిచ్చి,



"నువ్వు పట్టుకుపోయిన పచ్చి చేప లేవీ?" అని లక్ష్మి అడిగింది. బుచ్చయ్య జరిగిన సంగతి చెప్పాడు.

తన భర్త తెలివితేటలు ఎరిగినదే గనక లక్ష్మి ఏమీ అనక, కూరకు ఒక్క చేపను తీసి ఉంచి, మిగిలినవి అమ్ముకురమ్మని బుచ్చయ్యను పంపింది. బుచ్చయ్య వాటిని తీసుకుని ఊళ్ళోకి వెళ్ళాడు.

తరవాత ఆమె ఎండుచేపను తరిగేసరికి దాని పొట్టలో నుంచి తళతళ మెరుస్తూ ఒక వజ్రం బయటపడింది.

ఓడగల వర్తకుడు తన వద్ద ఉండే పెద్ద వజ్రాలు కొన్నింటిని దొంగల భయం కొద్దీ ఎండుచేపల్లో దాచాడు. ఓడ రేవు చేరాక కొంతసేపటికి చూసుకుంటే, వర్తకుడికి నాలుగు ఎండుచేపలు పోయినట్టు స్పష్టమయింది.

వెంటనే అతను రాజుగారి దగ్గిరికి వెళ్ళి, తన ఓడలో నాలుగు చేపలు పోయాయనీ, వాటిలో తాను మణులు దాచాననీ చెప్పాడు.

వెంటనే రాజు, ఎండుచేపలు ఎవరి దగ్గిర ఉంటే వాళ్ళను పట్టుకురమ్మని, తన భటులను ఊరి మీదికి పంపాడు. వాళ్ళకు దారిలో బుచ్చయ్య దొరికాడు. అతన్ని వెంటనే భటులు రాజు వద్దకు తీసుకుపోయారు. వర్తకుడు ఎండు చేపలను గుర్తించి, "అవి నా చేపలే, కావలిస్తే ఇప్పుడే

అతని పచ్చి చేపలు తీసుకుని త్వరత్వరగా జారుకున్నాడు.

అసలు సంగతేమంటే, ఆ రోజే రేవులోకి వచ్చిన ఒక వర్తకపు ఓడ నుంచి వీరయ్య ఆ చేపలను దొంగిలించాడు. దొంగతనం బయటపడే పక్షంలో తన దగ్గిర ఎండు చేపలు కనిపించటం మంచిది కాదు. ఆ పరిస్థితిలో వీరయ్యకు వెర్రిబాగుల బుచ్చయ్య దొరికాడు. అదే అవకాశంగా తాను దొంగిలించిన చేపలను అతడికి తెలివిగా అంటగట్టాడు.

బుచ్చయ్య ఎండు చేపలను ఇంటికి తీసుకుపోయి, "ఇక కూర వండు!" అన్నాడు భార్యతో.

వాటి పొట్టలు చీరి చూడండి, మణులుంటాయి," అన్నాడు సంతోషంగా. రాజు అలానే చేయించాడు. మూడు చేపలలోనూ విలువైన మణులు దొరికాయి.

"ఇంకొక చేప కూడా ఉండాలి," అన్నాడు వర్తకుడు.

"ఈ చేపలను నువ్వేనా ఈ వర్తకుడి ఓడ నుంచి దొంగతనం చేసింది?" అని రాజు బుచ్చయ్యను అడిగాడు.

"నాకు ఓడ సంగతే తెలీదు. వీరయ్య నా దగ్గిర పచ్చిచేపలు తీసుకుని ఈ ఎండు చేపలు నాలుగిచ్చాడు. ఒకటి ఇంటి దగ్గిర కూర చెయ్యమని ఇచ్చి, వీటిని నా భార్య చెప్పగా అమ్ముదామని ఊరిలోకి వచ్చాను," అన్నాడు బుచ్చయ్య.

రాజు పంపిన భటులు బుచ్చయ్య ఇంటికి వెళ్ళి, లక్ష్మికి చేపపొట్టలో దొరికిన వజ్రాన్ని తెచ్చి రాజుగారి కిచ్చారు. రాజు వీరయ్యను పట్టుకురమ్మని భటులను పంపాడు. కొంతసేపటికి భటుల వెంట వీరయ్య వచ్చాడు.

"ఈ ఎండుచేపలను నువ్వేనా ఈ బుచ్చయ్య కిచ్చింది?" అని రాజు వీరయ్య నడిగాడు.

వీరయ్య చాలా కంగారుగా, "నాకు వాటి సంగతే తెలీదు, మహారాజా!" అన్నాడు.

"వీటిలో రత్నాలు దొరికాయిలే. బుచ్చయ్య నడిగితే ఈ చేపలు నువ్వే ఇచ్చినట్టు చెప్పాడు. ఇంతకూ ఈ రత్నాలు నీవికావన్నమాట... చూడు, బుచ్చయ్యా, ఈ రత్నాలు నీవే! నువ్వే ఉంచుకో!" అన్నాడు రాజుగారు.

వెంటనే వీరయ్య, "ఆగండి మహారాజా! ఆ ఎండుచేపలను నేనే బుచ్చయ్య కిచ్చాను. అందులో రత్నాలుంటే, న్యాయంగా అవి నాకే రావాలి!" అన్నాడు.

వీరయ్య దొంగ అని రుజువైపోయింది. రాజుగారు వీరయ్యకు తగిన శిక్ష విధించి, రత్నాలను వర్తకుడి కిప్పించాడు.

వర్తకుడు కృతజ్ఞత కొద్దీ బుచ్చయ్యకు కొంత డబ్బిచ్చాడు. బుచ్చయ్య సంతోషంగా డబ్బుతో ఇంటికి తిరిగి వచ్చి, తృప్తిగా చేపలకూర తిన్నాడు.



**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | |
|---|---|
| *1. Place of Publication* | **'CHANDAMAMA BUILDINGS'**<br>**188, N.S.K. Salai**<br>**Vadapalani, Madras-600 026** |
| *2. Periodicity of Publication* | **MONTHLY**<br>**Ist of each calender month** |
| *3. Printer's Name* | **B.V. REDDI** |
| *Nationality* | **INDIAN** |
| *Address* | **Prasad Process Private Limited**<br>**188, N.S.K. Salai**<br>**Vadapalani, Madras-600 026** |
| *4. Publisher's Name* | **B.VISWANATHA REDDI** |
| *Nationality* | **INDIAN** |
| *Address* | **Chandamama Publications**<br>**188, N.S.K. Salai**<br>**Vadapalani, Madras-600 026** |
| *5. Editor's Name* | **B.NAGI REDDI** |
| *Nationality* | **INDIAN** |
| *Address* | **'Chandamama Buildings'**<br>**188, N.S.K. Salai**<br>**Vadapalani, Madras-600 026** |
| *6. Name and Address of individuals who own the paper* | **CHANDAMAMA PUBLICATIONS**<br>**PARTNERS:**<br>**1. Sri B. VENKATRAMA REDDY**<br>**2. Sri B.V. NARESH REDDY**<br>**3. Sri B.V. SANJAY REDDY**<br>**4. Sri B.V. SHARATH REDDY**<br>**5. Smt. B. PADMAVATHI**<br>**6. Sri B.N. RAJESH REDDY**<br>**7. Smt. B. VASUNDHARA**<br>**8. Kum. B.L. ARCHANA**<br>**9. Kum. B.L. ARADHANA**<br><br>**'Chandamama Buildings'**<br>**188, N.S.K. Salai**<br>**Vadapalani, Madras-600 026** |

**I, B Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.**

**1st March 1995**

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1995 మే నెల సంచికలో ప్రకటింపబడును.



Taji Prasad



Taji Prasad

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * మార్చ్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : సేద్యంలో మిత్రులు! రెండవ ఫోటో : క్రీడల్లో ప్రత్యర్థులు!

పంపినవారు : జె. నాగేశ్వరరావు 17/296, స్టేట్ బ్యాంక్ రోడ్,

మచిలీపట్నం-521 002 (ఆం.ప్ర.)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

